శ్రీ

# బలజా సౌభద్రీయము.



అను నీ తెలుగు నాటకము.

గోదావరీతీర విశ్వాసరాయపుర

వాస్తవ్యుఁడగు

కస్తూరి శివశంకరకవిచే

రచియింపఁబడియె.



మొదటికూర్పు ప్రతులు 1000

ఏలూరు.

సత్తిరాజు సీతారామయ్యగారి

దేశోపకారిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

కాపీ రైటు రిజస్టర్డు.



1903 సం॥

వెల 0-8-0




# బలజా సౌభద్రీయము.



అనసీ తెలుగు నాటకము.

గోదావరితీర విశ్వాసరాయపుర

వాస్తవ్యుఁడగు

కస్తూరి శివశంకరకవిచే

రచియింపఁబడియె.





మొదటికూర్పు ప్రతులు 1000

వేలూరు.

సత్తిరాజు సీతారామయ్యగారి

దేశోపకారిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

కాపీరైటు రిజష్టర్డు.



1903 సం॥

వెల 0-8-0

# పీ ఠి క.

---

పండితకవులార! నేనీనాటకమాటలకై మిక్కిలిచిన్నతనములో రచియించినదగు చేతను ఇదియేప్రథమకృత్యమగుటచేతను ఇందచ్చటచ్చట తప్పులుతప్పలుగా నున్నవి. నుక నేదీనిని ముద్రించక చిరకాలమునుంచి యుపేక్షఁజేసితిని. కాని, నాస్నేహితులు ందఱుపండితులు దీనినప్పుడప్పుడు చూచి యిదిప్రయోగమునకు సులభసాధ్యముగా ండుననియెన్ని ముద్రించవలయుననియెన్ని నన్నుఁ బ్రోత్సాహపఱచినందున నేనిప్పటికీ నా కమును ముద్రింపించితిని. మఱియు నీనాటకమునఁ బ్రస్తావనలో 'మొగలితుర్తి పురా శ్వరుఁడగు శ్రీకలిదిండి దైవప్రసాద కుమారలక్ష్మీనృసింహరాజుగారిని సభానాథునిగా ర్ణించినాడను. ప్రబంధములలో నేకాని నాటకములలో నీమాగణమిదివఱకెవ్వరునవలం చియుండలేదు. ఇదిరమ్యముగా నుండునేమోయని యీక్రొత్తత్రోవను వ్రాసితిని. ష్ణమిశ్రవిరచిత ప్రబోధచంద్రోదయ సంస్కృతనాటకమునఁ గీర్తివర్మదేవుఁడిటులనే భానాథుఁడుగా వర్ణింపఁబడినాఁడు పండితులిందలి మత్కృతములగుదోషములనుగ్రహిం నాకుఁదెలియజేసితిరేని వందనపూర్వకముగా నందికొని ముందుముద్రణమున సవరించు నెదను.

| | |
|---|---|
| 21-12-1903<br>విశ్వాసరాయపురము | ఇట్లువిధేయుఁడు<br>కస్తూరిశివశంకరకవి. |

# ఈనాటకమునందువచ్చుపాత్రములు.

---

పురుషులు.

బలరాముఁడు

శ్రీకృష్ణుఁడు.

సాత్యకి

అభిమన్యుఁడు. కథానాయకుఁడు ( బలరామునిమేనల్లుఁడు )

కరిబలుఁడు.<br>పింగళుఁడు. } ఘటోత్కచపరిచారకులు.

ఘటోత్కచుఁడు. భీమునికొడుకు ( రాక్షసుఁడు )

దేవేంద్రుఁడు.

బృహస్పతి.

నారదుఁడు.

దుర్యోధనుఁడు.

లక్ష్మణుఁడు. దుర్యోధనునికొడుకు. శశిరేఖను బెండ్లాడవచ్చినవాఁడు.

కర్ణుఁడు.

వామనభట్లు.<br>సదాశివుఁడు<br>జోశ్యస్సి } బలరామునిపురోహితులు

విప్రులు మొదలైనమఱికొందఱు

స్త్రీలు.

రేవతి – బలరామునిభార్య

సత్యభామ – కృష్ణునిభార్య

సుభద్ర – బలరామునితోడఁబుట్టినపడుచు – అభిమన్యునితల్లి

శశిరేఖ – బలరామునికూఁతురు – కథానాయిక

శీలవతి–చంద్రముఖి–సరసవచన –మధురవాణి –ననిరేఖసఖులు

– త్వరగతి – చంద్రిక – సీమంతిని – చేటికలు

# శుద్ధపత్రిక.

| పుట సంఖ్య | పంక్తి సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 13 | కుటింబిని | కుటుంబిని |
| 2 | 27 | చందిరాయితుడీశ దైవప్రసాద | చందిరాయిత దైవప్రసాద |
| ,, | 19 | తారముగ | తారము |
| 3 | 19 | వినీరసంబులటు | వినీరసంబులయి |
| 4 | 23 | రాజ్యము | రాజము |
| ,, | 25 | నీకుక్రమాగత | నీకుల క్రమాగత |
| 5 | 9 | బందెలబ్యోము | బందె లైకసూ? |
| 8 | 13 | హాలాయుధ | హాలాయుధ |
| 9 | 1 | దేశల | దేశముల |
| | 2 | రాజను | రాజరాజను |
| | 3 | పుత్రాదిరాజయ | పుత్రాదిచ్ఛత్రరాజయ |
| 10 | 23 | బలియులు | బలియులు |
| 11 | 24 | శ్రమకారిణం | శ్రమకారణం |
| 12 | 2 | తటాబ్ధిని | తటాబ్జిని |
| | 9 | ఇల | యిల |
| 13 | 6 | గేవల | కేవల |
| 17 | 3 | భిక్షుకుండైన | భిక్షుకుండైన |
| 18 | 25 | అ ర్తిలి | న ర్తిలి |
| 20 | 10 | కాలకృత్యములు | కాల్యకృత్యములు |
| | 25 | వెల్లడించుచున్నది | వెల్లడించుచున్నది |
| | 25 | కారణమేమి | కారణమేమి. |
| 21 | 21 | అభిమన్య | అభిమన్యుండు |
| 24 | 9 | ఇప్పుడీసంగతి | ఇప్పుడీసంగతివిని |
| 24 | 17 | గుణగ్రహాకురాలు | గుణగ్రహాకురాలు |
| | | నీవనుగ్రహించ | నీవోగ్రహించ |
| 26 | 23 | పచరింమి | పచరింపు |
| 27 | 13 | వటాకుల | వడాకుల |
| 28 | 3 | బూను | బూని |
| | 13 | చిత్రైకాగ్రత | చిత్తైకాగ్రత |
| 30 | 8 | సరస | సరసవచన |
| 31 | 2 | పుత్రికలైన | పుత్రికవైన |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 7 | మరణశవరణము | మరణశరణము |
| | 17 | నెమ్మగము | నెమ్మొగము |
| 32 | 27 | ... ... ... ... ... | నన్నూరకవిడిచి |
| 33 | 1 | మన్మధకు | మన్మధునకు |
| 38 | 25 | సింహాసనస్థత | సింహాసనస్థ |
| 41 | 1 | ... ... ... ... ... | తెరలో |
| 42 | 6 | రాజరాజసుపూజ్యరాజసన్మాన్య | ... ... ... ... ... |
| | 16 | అడుగాల | అడుగున |
| 45 | 8 | నారదవిషయము | ... ... ... ... ... |
| 50 | 26 | సీరికి | వీరికి |
| 51 | 6 | పురోహితురాల | పురోహితులార |
| 52 | 19 | రామభొట్లు | రామభట్టు |
| 58 | 5 | శరణు | శరణము |
| 64 | 3 | నాకపపాత్ర | నాకపపౌత్రు |
| 66 | 7 | బల్లిగుండు | బల్లికుండు |
| 69 | 7 | ద్వారకు | ద్వారకకు |
| 70 | 4 | నారదగురువర్య | గురువర్య |
| | 6 | నారదు | బృహస్పతి |
| 71 | 6 | యొల్లైనను | ... ... ... ... ... |
| | 17 | దల్లీ | తల్లీ |
| 72 | 17 | ఆయిుత్తము | ఆయితము |

శ్రీ

# బలజాసౌభద్రీయము.



## నాంది.

ఉ॥ శ్రీరమణీ ముఖాబ్జ మధుసేవన జాతమదాతిరిక్తర్షుం।
కార వచఃపరంపరలఁ గ్రాలెడు నామధుహారి మిమ్ముసా్వ।
కారులఁగానొనర్చుతఁ దగన్ మధుహారి మరందపానజ।
స్వారవచాతురిం బురుపు నవ్యముఁదేఁటిగఁ జేయుఁబోలికన్॥

మఱియు;

ఉ॥ శ్రీనగజాసతీమణి విశేష తమాప్తతఁ గౌఁగలించు పోఁ।
బూనికనైక కూపెఁడలఁ బొంగుచనుంగవఁ గాంచివైరియా।
కూన శశాంకుఁగొట్టఁజను కోకయుగంబని యెంచి హస్తయు।
గ్మానశశాంకునింగరయుగంబునఁ జన్గవఁబట్టి యాడు శ।
ర్వాణివిభుండు మిమ్ముల జరా మరణమ్ములఁ బాపి ప్రోవుతన్॥

సూత్రధారుఁడు- (నాందియనంతరమున సభవైపు చెవియొగ్గి) ఓయార్యపుత్రి! మీరు సెలవిచ్చినదివిన్నాను మీయాజ్ఞ యెట్లన్నట్లె! (తెరవంకఁ జూచి) ఓసికుటుంబిని! మాట!

నటి- (ప్రవేశించి) ప్రాణనాయక! వచ్చితిని, ఏమితమయాజ్ఞ?

సూత్ర- ప్రియురాల! సర్వలక్షణ, లక్షితమైన యీసభ చూచితివా? గురుదైత్యగురునయ విద్యావైపుణీ ప్రఖ్యాతి తిరస్కారణపటువిశేష శేముషీసాధ్య వివిధ తంత్రులగు మంత్రులును, వేదవేదాంగాధ్యయన బోధాచరణప్రచారణాది సద్గుణగణ సహితులగు పురోహితులును—

నటి- ఆర్య! ఇంకమీదీర్ఘసమాసవర్ణనాప్రగల్భతఁ జాలింపుఁడు. ప్రస్తుతప్రశంసయేమి

సూత్ర- సుమతులగు హితులును లోనుగాఁ గలిగియొప్పారెడు నీసభకధ్యక్షుండై, తారా

మండల మండితాఖండ చంద్రుండునుం బోలి భాసిల్లుచు

సీ॥ తనకీర్తి దిక్సతీధమ్మిల్ల సమితికిసరసంపు మల్లికాస్రక్కు గాఁగ।
దనప్రతాపంబుమార్తాండ కాండాఖండచండిమో పాధ్యాయసరణిఁజూపఁ।
దనసుందరత్వము ధనదపుత్రాంగజగర్వంబు బూర్వపక్షంబు సేయఁ।
దనధైర్యసాహసదాతృత్వగుణములు బలివిక్రమార్కుని దలఁపు దేఁగ।
లలితసింహాసనంబున వెలయుచుండె (వ్రేలితోఁజూపుచు)
వానిఁజూచితె! కల్దిండివంశవార్ధి-
చందిరాయితు దైవప్రసాదసుప్ర
సిద్ధసుకుమారలక్ష్మీనృసింహవిభుని॥

నటి- (సభకలియఁజూచి) నాథ! లోకాలోకపర్వత పర్యంతపర్యటన పటువిశేషకీర్తుల
తిరుంపగు నీమహాభాగు నెవ్వరెఱుంగరు?

సీ॥ ఎవ్వాని నామసంస్మృతి కవి శుక పికసంఘంబులకును వసంతబుతువో
యెవనివదాన్యత్వ మవిరతాగత యాచకాళి దారిద్ర్యపంకార్కఘృణియొ
యేనిమృష్టాన్నప్రదానము దీనక్షుధాంబుదతతికిజంఝానిలంబొ
యెవనిసుదర్శనమవనినా శ్రితమనస్తాపనిశాటసుదర్శనంబొ
అట్టికల్దిండివంశపయోంబురాశి
చందిరాయితు~~డీశ~~దైవప్రసాదసుప్ర
సిద్ధసుకుమారలక్ష్మీనృసింహవిభుఁడు
వసుధనాచంద్రతారము వఱలుఁగాఁత॥

సీ॥ ఎవనిసౌందర్యవైభవమీజగతిఁబర్వఁ బంచబాణునిరూపుపంచతఁగనె
నెతనివాణీప్రసన్నతనుతి కెక్కంగబొమ్మదేవరపూజమూలవట్టె
నేనిసంపూర్ణలక్ష్మీనిరతాప్తిచే విష్ణుఁడక్కునఁదాయివెట్టికొనియె
నేవానితీక్ష్ణతకినుఁడోడి మతిచెడిదిరములేకిటునటుఁదిరుగుచుండె
నట్టికల్దిండివంశపయోంబురాశి
చందిరాయితుడీశప్రసాదసుప్ర
సిద్ధసుకుమారలక్ష్మీనృసింహవిభుఁడు
వసుధనాచంద్రతారము వఱలుఁగాఁత॥

సూత్ర- ప్రేయసి! ఆహా! ఆమహాత్ముమహానివర్ణించుటచే నిప్పుడుగదా మన కవిత్వప్ర

త్నము ఫలించినది చూడుము.

మ॥ సరణిం దేనికిఁ బూర్వజన్మకృతస చ్చారిత్రమే బీజమున్
వరవిజ్ఞానమె నూతనాంకురము విద్వత్వంబె కాండంబు సుం
దర కావ్యంబె నవప్రవాళమును దన్మాధుర్యశక్తే పూవులౌ
ధరణిం దత్కవితా ద్రుమంబు విలసత్కల్దిండి లక్ష్మీనృసిం
హ రసానాయక దివ్య శోభన గుణ వ్యాపార సద్వర్ణనా
వర సాఫల్యము నొందకున్న నకటా వంధ్యత్వముం బొందదే॥

నటి- (సంతోషముతో) చిత్తము సరే ఆయనను జూచినాను తరువాత.

సూత్ర- ఈ కేతకీకుసుమ పట్టణమున వేంచేసియున్న భగవంతుడగు శ్రీరామదేవునకిప్పుడు కళ్యాణోత్సవవాసరములగుటనే తత్పురాధీశ్వరుఁడును సభానాథుఁడునైన యీ రాజోత్తమునిచే నిప్పుడిట్టులాజ్ఞాపించబడినాను.

నటి- (ససంభ్రమోత్సాహముగా) ఆర్య ఏమని?

సూత్ర- ఇదిగో వినుము. ఇట్లు, కుశీలవ!

గీ॥ కడఁగి యిప్పుడు కొందఱు కవులు పెక్కు
రూపకంబుల రచియించిరే పుమీఁదఁ
లలితగంభీర శృంగార సులభ శైలి
నలరు నాటక మొద్దేని నాడుమిచట॥

చ॥ రవికర నిర్జలీకృత సరస్సుల పోల్కి వరమ్య నాటక
శ్రవణ విసీరసంబులటు చట్టులు గట్టిన హృత్తటంబులన్
బ్రవిమల గద్యపద్యమృదు నాటక నవ్యసుధారస ప్రవృ
ష్టి వలనముంచి ముంచిమము సేయఁగ దే చరితార్థఁ గర్ణులన్॥ అని

నటి- ఔను, నిజమే!

క॥ పద్యము చదివిన తోడనె
హృద్యము గంభీరమగుచు నెదనర్థము సం
వేద్యము గావలె నదియన
వద్యకవిత్వంబటండ్రు పండితవర్యుల్॥

మఱియు.

క॥ కదళీపాకంబునఁదాఁ
గదియింపఁగవలయునాటకంబునఁగవివే
ఱొదవినవినుసభవారల
కదితెలియనిబాసవోలెవ్యర్థతనొందున్॥

సభానాయకుఁడు రసప్రమాణపారావార పారీణుఁడుగనుకనే యట్టినాటకమునా డఁగోరినాఁడు. మఱియాగణములోని నాటకమెద్ది ?

సూత్ర- (కొంచెముసేపాలోచించి చట్టనచిటికవైచి) ఓభాగ్యశాలీ ! వినుము.

క॥ శశ్వత్ప్రోక్తోపనిష
ద్విశ్వామరవిశ్వవిజిత విధిపట్టణమై
విశ్వేశరాయపురమదె
విశ్వాలంకారమగుచు వెలసెడుఁగాదే ॥

ఆపురంబున.

శా॥ శ్రీమత్కస్తురివంశవారినిధినీ రేజారివిద్వజ్జన
స్తోమానారతసంగపావనుఁడును శ్లోకుండునౌసుబ్బరా
యామాత్యాగ్రణివెంకమాఖ్యసుగుణ వ్యాపారయందున్న నెన్
ధీమంతున్ శివశంకరాహ్వయులస చ్ఛిప్రత్రరమ్యాకృతిన్ ॥

ఆశివశంకరకవిచే నవీనముగఁ గల్పింపఁబడిన బలజాసౌభద్రీయ మను నాటకమభినయించి సభ్యులమనమ్ములు దుర్భరానందసందర్భములగునటులఁ జేయనగును.

నటి- (సస్పృహోత్సాహముగాఁదలయూఁచి) బలే బాగుగా జ్ఞప్తికిఁ దెచ్చితిరి అవును స్త్రీ బాల వృద్ధ పామరజనంబులకు గూడ విస్పష్టముగాఁదెలిసి సభవారి నానంద దుగ్ధాంబుధి నోలలాడించునాటకమదియే; తత్ప్రదర్శనంబున నీయార్యమిశ్రులసంభావింపవచ్చును అందుకు నేనిప్పుడేమి సేయవలయును?

సూత్ర- ప్రేయసీ సర్వఋతురాజ్యమనుసమ్యక్పుష్పిత కుందవకుళ బంధురామోదసంగత గంధవాహఘుమంఘుమితసకల దిక్చక్రవాళంబును, సమస్తజంతుజాలమనోహ్లాదాపాదకంబును, నగు నీవసంతఋతువుఁ గూర్చి నీకుక్రమాగతకౌశల్యము తేఁటపడ శ్రావ్యముగాఁబాడుము.

నటి- చిత్తము (పాడుచున్నది-)

గీ॥ తియ్యమామిళ్ళఁజేరియ దృచ్ఛమీఱి
తనుచెలులఁజీరితలిరాకుగము ?గీటి

పాసగఁబుంసోకకిలలుగూయుఁబుష్పబాణ
జైత్రయాత్రాజయధ్వనిఁజాటుచుండి॥

సూత్ర- (పారవశ్యమునొంది) అహాహా ! ఏమిహృదయంగమమయినదే నీమధురగానము! పుష్పబాణజైత్రయాత్రాజయధ్వని చాటుచుఁ జెప్పుడోగోయిలలు గూయుచున్నవని వర్ణించితివికాని దానికన్న మిన్నయగు నిదిచూడు

చ॥ పొలుపగునీదుగానమునె పూవిలుకానిరథారవంబటం
చలయికఁగాముకప్రతతి హా, యనిమూర్ఛిలిదేహమంతటన్
బులకలుచెంగలింపవిరిబోణులకౌఁగిలె రక్షకంబుగాఁ
దలఁచియదిప్డుపొందమిన దక్షతమారునిబందెలయ్యెడున్॥

సరే! ఇంకముందేమి సేయుదము?

నటి- అయ్యో ! ఇప్పుడకాదేశివశంకర కవివిరచిత బలజాసౌభద్రీయము ప్రయోగింతమంటిరి! ఇంతలోనమఱచితిరిగా!

సూత్ర- (సవ్రీడావినోదముగా)

గీ॥ మగువరో నీదు గానంపు మధురసంబుఁ
గ్రోలిసభ్యులుమనముల రూఢిదప్పి
పలకపైజిత్రితములగు ప్రతిమలనఁగ
మ్రానుపడియుండి రొక్కఁడ నేనకాను॥

(తెరలోమృదంగధ్వని)

సూత్ర- (చెవియిచ్చివిని) అదిగో గానమారంభించినారు. రమ్ము-

నటి- (సస్పృహాశ్చర్యకముగాబుజముతట్టి) ప్రియుఁడా! చంద్రికాచకోరకులకీ రాత్రిరాక్షసవివాహముజరుగునఁట! మీరేలలక్ష్యము సేయరు?

సూత్ర- ఓసిమూర్ఖాగ్రేసరురాల ! చంద్రికాచకోరకసమాగమము విధికృతముకాదె? నీకీ పిచ్చియేమి?

నటి- ఓయన్యచిత్త! అదికాదు, మీయన్నకూఁతురు చంద్రికమాట!

సూత్ర- ముద్దరాల! నీవుసెప్పినసంగతి నేనెఱుఁగుదును అయిననుమనమీసంగతిలోఁ దటస్థులమైయే యుండవలెను. కాఁబట్టి నీవుప్రకృతోపయోగమయినరేవతీ పరిచారికవేషముధరించిరంగస్థలము ప్రవేశించవలసియున్నదిఁ కరమ్ము.

(ఉభయులునిష్క్రమించిరి)

ఇదిప్రస్తావన.

# బలజా సౌభద్రీయము.



## ప్రథమాంకము.

(రాజాంతఃపురము)

(అప్పుడు చంపకమాల ప్రవేశించుచున్నది)

చంప॥ ఔరా! మొన్న మొన్న వచ్చియు రాని ముద్దుమాటలచే వినువారి చెవుల కానంద
రసము నింపుచుఁ జిఱుగంతులు వేయు శశిరేఖకప్పుడ యౌవన దేవత పైకొన్నది!
కనుకనే, నేఁడొక గ్రంథముఁ జదువుచునందు

గీ॥ మరువికారము సర్వసామాన్యమయ్యు
నతివలకు వైవిధ్యమ్ములనగ్గలంబు, అను పద్యము రాఁగా

గీ॥ చంద్రబింబోపమేయలసన్ముఖంబు
నందు దరహాస చంద్రికల్ గ్రందుకొనఁగఁ
గేవలంబుగ యాథార్థ్యభావమట్టె
యభినయించెను శృంగార హావవిధుల।

(తలపంకించి) నాకీపిచ్చియేల? ఏవానియాజ్ఞ ప్రాకృతులమగు నస్మదాదులయందె కాక సర్వస్వతంత్రులగు హరిహరహిరణ్యగర్భులయందును నిరంకుశ ప్రాభవము గలిగి శాసించుచున్నదో అట్టె యనిర్వాచ్యమన్మథ భగవానుని విలాసమిట్లున్నది. కనుక నీవిషయములో నిం వింతయేల? సరే! ఈ యౌవన సూచనలను బట్టి యే రేవతీదేవియును దనకూఁతునకిఁక వివాహప్రయత్నము సేయవలెననియు నీసంగతి దనపతితో నీదినమునఁ బ్రస్తావించెదననియు జెప్పినది, కాఁబట్టి మన శశిరేఖకు సత్వరంబుగఁ బరిణయంబు కాఁగలదు. నాకు గొప్ప బహుమానమబ్బఁగలదు. (ఉల్లాసముతో) ఔను! కాకేమి? ఎప్పుడు నేలికల శుభోదర్కమ లేకదా సేవకులకు ఫలదాయకములగునే! (వెనుకకుఁ జూచి) బళే! రేవతీబలరాములును

హాసకుఁడును బ్రవేశించుచున్నారు; శశిరేఖపెండ్లిమాటలువినుటకు నేనీప్రక్కగదిలో నికింబోయెదను. (నిష్క్రమించెను) ఇది ప్రవేశకము-

(అప్పుడుబలరాముఁడును రేవతియు విహాసకుఁడును బ్రవేశించుచున్నారు.)

---

బల-కోమలీ! ఈదినముననీహృదయమెద్దియో యొకదీర్ఘాలోచనయందుఁ బ్రసక్తమ యియున్నటుల నీముఖవైఖరి సూచించుచున్నది, కారణమూహింపలేకుంటిని!

రేవ-నాథా! మీరెఱుంగని కారణములు వేఱేమున్నవి?

మనశశిరేఖకుఁబెండ్లియీడువచ్చినది. ఇకసత్వరముగావివాహప్రయత్నములు సేయవలెను-ఇదివఱకే యాలస్యమైనది. మిమ్ముఁగానట్టు లూరకుంటిరి. మీమగవారెప్పుడుధన్యులే. స్త్రీజన్మముకడుఁగష్టభాజనముగద! చిఱుతప్రాయము నుండియుఁ బ్రాణతుల్యముగఁ బెంచుచుంట నెట్టివరుండు సేపఱునో యనిరాత్రింబవలుక్రుంగృశించుచుంటి నిదియేనాయాలోచన

బల-అర్ధాంగీ! ఈవిషయమునమనమిరువురము సమానబాధ్యులమే. నీవువగవనేల నేనీవిషయమై యోచించుచు నేయుంటినెచ్చటను సర్వలక్షణసంపత్తిగల వరుండు పొడగానమినింతతడవయ్యె. నయినను.

క॥ అంచితముగ బిసినికిరవి
నెంచికుముద్వతికిఁబూర్ణహిమధాముని దా
మించుజతకూర్చెనెవఁడో
మంచివరునిఁదెచ్చువాఁడెమనపుత్రికకున్॥

ద్వారపాలకుడు-దేవా! ధుర్యోధన మూర్ధాభిషిక్తునొద్దనుండి యిరువురుబ్రాహ్మణులు వచ్చియున్నారు.

బల-ఏమీ! వారుసర్వజనమాన్యులేత్వరగాఁ బ్రవేశపెట్టుము.

ద్వార- (నిష్క్రమించెను)

విదూ- సరి ఇఁకనేమి? ప్రభువుగారు ప్రస్తుతము పుత్రికకు సత్సంబంధాన్వేషణము సేయుచుండ నిప్పుడె సత్పురుష సమాగమము గూడ సమకూరెను. సద్బ్రాహ్మణుఁడనయిన నావంటి సచివుఁడుండ రాజు గారికేప్సితార్థసిద్ధి యేలఁ గాక పోవును? హుఁ!

బల- చాలించుము మిఁక నీయాత్మస్తుతి తనుఁదాన పొగడికొనుట మఱియొకతీరుగానుం

డును నీప్రజ్ఞావిశేషములు మేమిదివఱకెఱుఁగనివికావు-

విప్రులు- (ప్రవేశించుచున్నారు-)

బల- (దిగ్గనసింహాసనమునుండి లేచి) పూజ్యులార నమస్కరించుచున్నాను-

విప్రు- దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము-

బల- అయ్యా మీదర్శనమున మావంశమెల్లఁబావనమయ్యె సర్వధర్మవేత్తలయిన మీయట్టిమహాత్ములసందర్శనము లభించుట మాభాగ్యములు ఫలియించుటగాదే? దయచేసి యీకనకాసనములఁ గూరుచుండుఁడు-

(అందఱుఁగూరుచున్నారు-)

బల- అయ్యా! దుర్యోధనుఁడు సపుత్రమిత్రకళత్రబంధుపరివారముగాఁ గుశలముగనున్నాఁడా?

విప్రు- ఆ- దైవకృపచే సర్వము జయముగనున్నది-

బల- చిత్తము మీరువచ్చినపని సెలవిచ్చి నన్నుఁ గృతార్థునిఁగావిండు-

గీ॥ పుణ్యపురుషులకార్యముల్ పొందుపఱచి
ప్రీతితోవారుసెప్పెడు నీతివినుచు
నెగుటిబలమునుదనబల మెఱిఁగియెఱిఁగి
చేయురాజ్యము సంతతశ్రీలనొసఁగు॥

అనిపెద్దలునక్కాణించెదరు-

విప్రు- హలాయుధ నీకంటెఁ బుణ్యపురుషులెవరు? ఊరకమాయందలి భక్తింజేసి యట్లనియెదవు- సంతోషమాయె- దుర్యోధనుడు తనపుత్త్రుఁడగు లక్ష్మణునకిప్పుడువివాహముసేయనెంచి యతని కనురూపవతియగు కన్యనెచ్చటను గానక నీపుత్రియగు శశిరేఖ సకలసద్గుణముల నతనికి సమానురాలని విని యామెను దన కుమారునకిచ్చి పరిణయముసేయ నీయనుమతిగొనిరండని మమ్మునీకడకుఁ బంపినాఁడు. దుర్యోధనుఁడు నీవెఱుఁగనివాఁడుగాఁడు జగమెఱిఁగినబ్రాహ్మణునకు జందెమేలన్నట్లునాతని సంపదవర్ణింప ననవసరమయ్యుఁ జెప్పుచున్నాము వినుము-

గీ॥ తమ్ములందఱెన్నసుదారబలులు
పుత్త్రశతమెంచ నేటికిమిత్రసములు
తాననఘరాజరాడ్బిరుదప్రభాసి
సిరులుసంపదలిఁకవేఱెచెప్పనేల?॥

అంగవంగకళింగాదులయిన యేబదియాఱు దేశ మానవాధీశ్వరులును; వారివారి శిరోరత్నములచేఁ బాదపీఠ మలంకరింప రాజసభయందుచేఁ బేరోలగమున్న యా సుయోధనుఁ జూచితిగావలదే? పుత్రాది రాజయమ్మనునటుల రాజరాజకుమారుఁడైన లక్ష్మణుఁడును సర్వలక్షణములఁ దండ్రికంటె నధికుఁడు. కాఁబట్టి తెన్నుగ నాలోచించినచో.—

క॥ నీపుత్రిన్ శశిరేఖను
రాపుత్రునకిచ్చెదేని రహిదాంపత్యం
బేపట్లం బటికించిన
నాపద్వినిపద్మబంధు లట్టుల నెగడున్॥

విదూ- ఓబ్రాహ్మబంధులార! చాలసేపటినుండి మీదుర్యోధను సంపదలను గడుసన్నుతించుచున్నారుగాని మీరాజునొద్ద నావంటి సచివుండొక్కఁడయినఁ గలఁడా!

విప్రు- (చిఱునగవుతో) లేఁడులేఁడు నీయట్టి సుగుణరాశి దొరుకుట దుర్లభము గాదా

విదూ- ఇంతస్తుతియునన్నే? అహాహా (అనినవ్వుచున్నాఁడు)

బల- ఆర్యులార! నాసర్వస్వము మీకిచ్చినను యిప్పటి నాసంతోషము తీరదు. ప్రస్తుతము పుత్రికకట్టివరుండు చేకురునో యని యెంతయు వగచు మాకు మధ్యాహ్నచ్చండమయూఖసంతప్తుఁడగు వానికినవ్యామృతవృష్టివోలెఁ గడుంగడు నానందము నగూర్చితిరి- ఆహా! రారాజుతో వియ్యమందుటకన్న నాజన్మమునకు సార్థకమేమున్నది. ఇదిగో నాభార్యతో యోచించుకొని మనవిజేతు-

విప్రు- సందేహమేల? తల్లియనుమతిలేక పిల్లలవివాహ విషయమునుమంతయు నెత్తంజనదు ఏమా?

క॥ లలినెంతయు నవమాస
మ్ములు మోసినను బ్రకష్టములనొందియు న
వ్వలఁ గనియు నేకహేయ
మ్ములగు పనులకోర్చు తల్లి ముఖ్యము గాదే॥

బల- (ప్రక్కకుఁజూచి) ప్రియురాలా! వింటివా శశిరేఖ పెండ్లిమాటలు?

రేవ- (సమీపించి) నాథా! వినుచున్నాను.

బల- మఱినీయభిప్రాయమేమి?

రేవ- (ఒకనిమిషమాలోచించి) ప్రాణేశ్వర! నాకొక్కసందియము మాత్రము బాధించుచున్నది. పాండవులుద్యూతాపజితులయి యడవులకుఁబోవునప్పుడు సుభద్రాభిమన్యులిచ్చటనే నిలిచియుండిరిగదా? అప్పటినుండియు మన శశిరేఖయు నభిమన్యుఁడు గలసియాడుకొనుచుండఁ బ్రజలందఱు ( శశిరేఖ యభిమన్యుని భార్య యని యొక్కటనొక్క వక్కాణించుచుండిరి. మఱియు నిప్పుడు (( పాండవులు కాలముదప్పి కానలనుండఁ దోడబుట్టినది. తమయింట జీవనము సేయుచున్నదన్న చులకనచేఁగదా పిల్లనితరులకిచ్చుకొంటిరి! అను నపవాదము రాకమానదు. ఎంతటివారును లోకులకు వెఱవవలెనుగదా! లోకములోఁ బ్రజలన్యోన్యము లోకనిందకే వెఱచుచున్నారు. పరమార్థము దేవుఁ డెఱుంగును.

బల- (నిరుత్సాహముతో) అయ్యో! అతిరభసప్రసారముగల సెలయేటి ప్రవాహమునకు పెద్దకొండయడ్డువచ్చెఁగదా! (కొంతతడవాలోచించి)

ఉ॥ మంతనమేమిటో చదభిమన్యునకీయఁగనైన లోకవి
శ్రాంతరమావిశాలుఁడగు రాజకుమారునకీయనైన నీ
చింతను నామనంబవుర చేష్టలుపక్కిచలింపదాయయు
స్వాంతముక్రిందుమీఁదులను గల్గిన లోహశలాకపోలికన్ ॥

(మఱియు నాలోచించి నిశ్చయభావముతో) ప్రేయసీ! నీవిట్లు లోకపరిపాటిచేఁబలుకుచుంటివే కాని యిందలి పరమార్థము కనిపెట్టలేకున్నావు. లోకములో మేనఱికమును లోకవెట్టిచేఁ గొందఱుగుందుచున్నారు. ఎప్పుడుఁ గ్రొత్త సంబంధమున్ననన్యోన్యానందము ప్రాచీన సంబంధమందుండదు. అదిగాక యెంతయుఁ గ్రొత్త సంబంధసంగ్రహము సేయుచుండిననే కాని లోకములోఁ బలుకుటుంబములకైకమత్యము గలుగదు. ఇంకొకటి ఒకగొప్ప పండుగల చెట్టువిత్తనము నాటగా దాని మొక్క దానికన్నఁ జిన్నకాయలుగాఁచును. దాని విత్తును నాటగా దానికన్నను చిన్నకాయలఁగాచును. ఇటులనే రానురాను బొత్తిగ బలహీనమగును. మనుజులును క్రొత్త క్రొత్త రక్తసంబంధము చేఁగడుబలీయులుద్భవింతురు గాని యేకప్రకృతి రక్తము నేగలవారు మాటిమాటికినిగలయుచుండిరేని గడుబలహీనులుబుట్టుదురు. ఇది ప్రకృతిశాస్త్రమర్యాద. ఇవియన్ని యటుండనీయుము శశిరేఖ నభిమన్యునకిచ్చిననా కుఁగాని నీకుఁగాని తెఱుము ప్రచ్ఛలనదగునా?

శేష- నాథా! నేను జెప్పవలసిన దిక నేమున్నది? ఎవరికైనను బిల్లదానికిఁ దగినవరుఁడు దొరకవ
లెనని కోరిక యేకాని వేఱుగాదు కాబట్టి

గీ॥ అత్తకోడండ్ర వైరములఁ బెంచివారల
లిరువురకుఁ బ్రాణసమముగఁ దానయుక్తుఁ డగు మ
రూపమున మారుఁ గేడుచూపరి మన
పుత్రికకు భర్త గావలె ముఖ్యముగను॥

తరువాతనో! తమచిత్తము.

బల- (సవిమర్శముగా) అయ్యలార! వేయు నేల? వివాహకార్యములలో మాత్రము మేన
ల్లుఁడు గీనల్లుఁడు ననుమోమోటమి కట్టిపెట్టవలెను రత్నమువంటి పిల్లను మేనల్లుఁడని
యభాగ్యున కిచ్చి దానికి మితిమీరిన దుఃఖము గలుగఁజేసినపాపము చేరారవాదినర
కములనుభవించుట కంటె లోకాపవాద మెట్లయిన భరింపవచ్చును. లోకులు కాకు
లువంటివాండ్రు. లోకానుసారముగనడుచువా రొక్కరును లేరు. అట్లునడచెనే
నియుఁ గతిపయదినములలో వాఁడు సర్వభ్రష్టుఁడై చెడకమానఁడు. లోకములోఁ బ్ర
తిమనుజుఁడును నెల్లెయినరోజు గడచుటయుఁ గొంతపబ్బ వెనుకఁబడుటయు ని
తరులదోసము లెంచుటయు ముఖ్యధర్మములుగాఁ జూచువారుగాని లోకజ్ఞానము
గుణదోషవిచారము; మానుషధర్మజ్ఞత; ఇవిగలవా రెక్కడనో గాని లేరు. అట్టిపిచ్చి
లోకులని మెదరన్న భీతియెవరికి? ఇట్లు నిందించెడు ప్రతివాఁడును స్వవిషయము వచ్చి
నప్పుడు వేఱగును. తదితరులు వానినిందించుటకై లోకులగుదురు. అదిగాక యొక్క
గృహస్థుఁడు సమస్తకష్టసుఖముల నెఱిఁగి తనసంసారమును దానుద్ధరించుకొను
చుండ దానిలాభనష్టములతో సంబంధము లేని పయితెలఁగాఁడ్రందఱును సంగతిసంద
ర్భముల నెఱుఁగక యేవానిచే యకృత్యములను వంకలొత్తుచుండుటనీ లోకము
నకుఁ గడుదురభ్యాసమయినది. ఇట్టిదురభ్యాసములఁబో కార్ప సర్వేశ్వరుఁడనుగ్ర
హించెడుఁగాఁత! లోకోభిన్నరుచిః॥ అనునట్లు లోకులందఱు నొక పంథ నెప్పుడును
డువఁబోరు. "స్వపక్షస్యతుశంకిం వా కాకస్యాశ్రమకారిణం॥ ఆనునటుల నెద్దుపుండు
కాకికి నొప్పియో? కాఁబట్టి చిరంజీవియగు లక్ష్మణునకు నాకూఁతు నిచ్చెదను దఱు
చేసి యిప్పుడు శుభముహూర్తనిశ్చయము సేయుఁడు.

విప్రు- (ఆలోచించి) ఎల్లుండి తెల్లవాఁరుజామున తారాచంద్ర బలములైనవద్యములుగ ను

స్నవి. అదియేమంచిముహూర్తము.

బల- సరే అటులయినమీరప్పుడు తరలిరావలెను. ఇదిగోఈకర్పూర తాంబూలమందికొ నుండు. (ఇచ్చుచున్నాడు)

విప్రు- (పుచ్చుకొని) దీర్ఘాయుష్యమస్తు. ఇంకమాకుసెలవొసంగుము.

బల- చిత్తము. దయనుంచుండు.

(తెరలో వైతాళికుఁడు)

చ॥ పొలములనుండికర్షకులు పోయెదరిండ్లకుసైచకొండకుం
గొలఁకులడస్సివారిఖగకోటితటాన్తరిసేరుచుండెనీ
ఇలనిను్డుగ్రతేజమునవేఁచుచునుచ్ఛనుబొందివెల్గగా
ఖలనివహంబువోలెనతికార్శ్యముఁనొందెడునీడలిప్పుడుం॥

బల- (పైకిఁజూచి) ఓహో! మధ్యాహ్నమైనది. నేనునభ్యవహారాదికృత్యముల నిర్వర్తింప నేగెదను. (అందఱునిష్క్రమించిరి.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# బలజా సౌభద్రీయము.



## ద్వితీయాంకము.



రంగము-కృష్ణమందిరము.

(అప్పుడు పరిచారకుఁడు ప్రవేశించుచున్నాఁడు-)

(ఆకాశమువంకఁజూచి) ఆహా! సర్వధర్మములను సంపూర్ణముగ నెఱిఁగినట్టి పెద్దపెద్దలే సత్యముతప్పుచుండనిఁక నస్మదాదులలెక్క యెక్కడ? బలరాముఁడు తనకూఁతుఁ శశిరేఖ నభిమన్యునకిచ్చెదనని తొలుతనుండియు వచించుచుండి యిప్పుడు దుర్యోధనుఁ డడుగఁబంపఁగనే యుబ్బి పట్టిపెంగలియై పిల్లను లక్ష్మణునికి నిచ్చెదనుగాని యభిమన్యునకీయనని గంతులు వేయుచున్నాఁడు. కేవలధనము నే కోరినాఁడుగాని గుణదోషములనెంచినవాఁడు కాఁడు. పాండవులు సర్వదేవతా ప్రసన్నతగలవారు. ఈకార్యముగువఱకును నాకు నమ్మకముచాలదు. ఊఁ! ఇంతకొక పరమార్థముగలదు.

క॥ కాఁగలకార్యములన్నియుఁ
సాఁగకమతిమానవల్ల సరసిజభవుఁడే
యేఁగడియ కేదిగూర్చునొ
బాగుగయోచింపధర్మపద్ధతి నెప్పుడున్ ॥

(తెరలో)

సాధు! దాసీపుత్ర! సాధు! క॥ కాఁగలకార్యములన్నియు॥ వను పద్యము మరలఁజదువఁబడుచున్నది.

పరి- ఓహో! మనప్రభువగు శ్రీకృష్ణభగవానులు సభామంటప మలంకరింప దయచేయుచున్నారు? నేను నాయన పార్శ్వవర్తినయ్యెదను- (నిష్క్రమించెదు)

ఇతి ప్రవేశకము.

[అంతట సత్యభామాద్వితీయుఁడై శ్రీకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు-]



కృష్ణు-సాధు! దాసీపుత్ర! సాధు! (క॥ కాఁగలకార్యములన్నియు॥ ననుపద్యమును ; అలఁ బఠించుచున్నాఁడు-)

పరి- అయ్యా! ఇదిగో యాసనము నిందుదయచేయుఁడు.

ఉభయులు-(కూరుచున్నారు.)

కృష్ణు- (ఆకాశమువంకఁ జూచి తలపంకించుచు) ఆహా! సర్వలక్షణసంపన్నుఁడును మేనల్లుఁడు నగు నభిమన్యుఁడుండఁ మాయన్నగారికి లక్ష్మణుఁడల్లుఁడు గావలసి చ్చెఁగా!

సత్య- నాథ! గీ॥ కూఁతుఁగలవారలవ్వలఁగూరుచుండ
వారికోరికలన్యునివలననుండ
నిట్టినిష్ఠురవాక్యములిచటమీరు
పన్యసించుటవలననౌఫలమిఁకేమి॥

గీ॥ అలధనంజయసుతుఁడు మేనల్లుఁడగును
మీకుసీరికిసమముగ మేనువర్ణ
అట్టియెడధర్మమవ్వలఁగట్టివార
లుండఁ మీరిట్లుపల్కుటయుక్తమగునె॥

అదియునుఁగాక యభిమన్యునిప్పటిస్థితిఁజూడఁ; బూజ్యులయిన బావగారి యుద్రేకముఁజూడ; శశిరేఖ నభిమన్యునకుఁ గూర్పఁబూనుట వట్టివెఱ్ఱితనము.

(తెరలో)

మత్తకోకిల-ఎన్నిమాయలుగల్గుచుండెనిదేమిచిత్రము! చూడఁగన్
జిన్నిప్రాయమునుండినాకలసీరిపుత్రికకోడలా
నన్నమాటలుకల్లలై యిపుడన్యభావంబులుపుట్టెనే
నెన్నఁడైనను నెగ్గొనర్చితినే మొసీరికి దైవమా॥

కృష్ణు- (చెవియొగ్గివిని) అక్కటా! సుభద్రవచ్చుచున్నదిగదా! ఈపెకీసంగతి యింత లోన యెట్లుతెలిసినదో; ఈపె నెట్లూరడింతును?

సుభద్ర-(నిట్టూర్పువిడుచుచుఁ బ్రవేశించుచున్నది-)

కృష్ణు- సోదరీ! ఎల్లప్పుడుఁ గలఁకఁ దేజరిల్లుచుండు నీముఖం బీదినమున బొత్తిగఁ గలఁకఁ బాసి ఛిన్నప్రచ్ఛన్నకొని కడుదీనత్వమును సూచించుచున్నది?

సుభ- నావంటిమందభాగ్యురాలికి దీనత్వముగాక ధీరత్వమెట్లువచ్చును.

కృష్ణు- దుర్వార దైవదుర్విలాసముచే నీభర్తృకాంతార సంతానములఁ గ్రుమ్మరుచున్నను నీవుఖేదపడియెదవను చింతచే నెంతయు జాగరూకతతో నున్నవారము గాని వేఱుగాదు. అట్టియెడ నీవింతవంతనొందుటకుఁ దగిన నూతనకారణమేమి?

సుభ- అబ్బా! ఏమియు నెఱుఁగనివానిఁబోలి యెంతచిత్రముగా నటించెదవోయి! శశిరేఖను లక్ష్మణునకిచ్చెదరఁట గా! (కన్నీరు పయ్యెంటనొత్తికొనుచు) కాలవశమున నా భర్త యడవులఁబడి తిరుగుచున్నను లక్ష్మీసమానురాలయిన యీపిల్లను జూచుకొని రోజులుబుచ్చుచుంటి నట్టియెడ నామనోరథము అన్నియు నడఁగె- నా కొంగుమాట వోయె. హా! పాపపుఁ గాలపురుష! సాధుబాధక! అహా?

(యేడ్చుచుక్రిందఁ జతికిలఁబడుచున్నది)

కృష్ణు- (లేవనెత్తి సేదదేర్చి) అమ్మాయి! ఇంతవెఱ్ఱిదానవయితివేమి? నేనుండ నీకుమరియొకలోటు రాఁగల్గునా?

సుభ- ఔను ఇదివరకు నేనట్టులే నమ్మియుంటి అదియంతయు నడచినదిసరే కాని, బలరామునికడ కొకసారివోయి సందేహనివృత్తిజేసికొని యనవలసినమాటలని వత్తమా?

కృష్ణు- అడ్డమేమి? పోదమురమ్ము- (ప్రక్కకుఁజూచి) సాత్యకీ!

సాత్యకి- (ప్రవేశించి) అన్నా ఏమితమయాజ్ఞ.

కృష్ణు- బలరాముఁడు శశిరేఖ నభిమన్యునకీయననెనఁట! కనుఁగొందమురమ్ము.

సాత్యకి- (సక్రోధవైవర్ణ్యముగా) ఇదిగో సర్వసిద్ధుఁడను-

అందఱు (నడచుచున్నారు)

పరి- అయ్యా! ఇదేబలరామసౌధము-

అందఱును బ్రవేశించిరి-

రంగము-బలరామాంతఃపురము.

(బలరాముఁడు సింహాసనస్థుఁడై యుండఁ గృష్ణుఁడును సాత్యకియు సుభద్రయుఁ బ్రవేశించుచున్నారు-)

బల- కృష్ణా! ఈయాసనమునఁ గూరుచుండుము- సాత్యకీ! నీవునిట్లు గూరుచుండుము-

సుభ- (తనలో) ఏమి యీ చిత్రము! ఇదివరకెప్పుడు నత్యానందముతో నుండు నీతఁడీది
నమున నన్నుఁ జూచి తూష్ణీంభావమును వహించినాఁడే! అట్టినగ్రుద్దినట్లు నేవ
చ్చినకార్యము గ్రహించినాఁడు గాఁబోలు! ఔర!!

కృష్ణు- (సింహాసనముపై నొకచేయియుంచి నిలువఁబడి) అన్న!

క॥ కాఁగలకార్యములన్నియు
సాగకమరిమానవల్ల సరసిజభవుఁడే
యేగడియకేదికూర్చునొ
బాగుగ యోచింపధర్మ పద్ధతి నెపుడున్ ॥

కాఁబట్టి తోడఁబుట్టినది దర్శనమునకు రాఁగాఁ గూడ మండుమనియైనయనఁ జెల్లదో ఆవలవ్యవహారములకేమి?

బల- నేనుగూరుచుండుమని రాజమర్యాదలు జరుపుటకేమి క్రొత్తగ వచ్చినదా యేమి

సుభ- అన్న! నన్నుఁ గూరుచుండుమనిన నతనివాసిబీఁకుపోదా? నన్నొకరుగూరుచుండు
మని చెప్పనేల? నేను క్రొత్తగ రాలేదు. నేను గూరుచుండెద. (ఒక్కచోఁ గూ
రుచుండి యన్నగారితో నేమో చెప్పబోవుచున్నది.)

విదూ- (తనలో) బలె! ఈయమ్మ వెనుక నొకసారి నన్నుఁ గసరివేసినది, ఇప్పుడీమెను వం
చించుటకు మంచిసమయమువచ్చినది. (పైకి) అబ్బ! మనకిప్పుడెక్కడను లేనిపే
దయాపుణ్యాలువచ్చెను! ఎవనితో నేకార్యమున్నదో యెఱుఁగకపో-

బల- చాలించుము, తుంటెఁగొట్టినఁ బండ్లు రాలె, నని నీకెందుకీయసందర్భపుఁ బ్రశంసన

విదూ- అయ్యో! ఇతఁడేమో మనమాటననుసరించునని కొని విజ్జివీగితిని. నన్నిపుడెదుట
నేవంచించినాఁడు. ఇఁకఁ దలఁ దడవికొని మనమూరకుండుటయే పని.

కృష్ణు- అన్న!

గీ॥ చెంతనున్నట్టి స్వీయమాచెలువవిడిచి
పరుల నెల్లనకాశించుభంగిసుతను
సర్వలక్షణయుతుఁడును స్వస్రుసుతుండుఁ
బార్థుఁడానకీయనంటివేపరులఁ గోరి?॥

అదిగాక.

క॥ మేనత్తకొమరుఁ దప్పింపఁగ మానిలోగుణ

## ద్వితీయాంకము.

దోషమంత్రుడుమహితాత్ములిలన్
గానసుతేనుబాధిజునకు
దానమొసఁగిదానభువినిధన్యుఁడవగుమీ॥

బల- కృష్ణ! నీపక్షపాతఁపుమాటలు విని నేనెట్లుమోసపోదును?

ఉ॥ లక్షణవంతుఁడైవెలయులక్ష్మణుఁబెల్లునఁ బోల్చి చెప్పెదా
భిక్షుకుఁడైనపార్థుఁ జూనిఁ బెద్దగఁ జెప్పెదవిక్షువంచునీ
పక్షమెచూతుగానియతివన్ దగుభర్తనుగూర్పఁ జూడవీ
సుక్షియె? కాక; సోదరునికూఁతురఁదేఁ బిచ్చివ్యులెచ్చటన్॥

క॥ తాఁదాల్చినకుండేటికిఁ
బాదములిలమూఁడుఁటంచుఁబల్కెడుభంగిన్
బీదయగుపార్థుపట్టిని
సోదర! కురునూనుఁబోల్పచోద్యముఁగాదే॥

క॥ నవమద్రసభక్ష్యాన్నము
లెవఁడావలఁదొ్రిసిగంజి నేకోనసెంచుం
భువివాఁడులక్ష్మణునివిడి
వివరింపకపార్థుజూనకుఁబిల్లనొసంగున్॥

కృష్ణు-(సుభద్రవంకఁజూచుచున్నాఁడు.)

సుభ- అన్నా! గీ॥ ప్రాణనాథుఁడుమఱదులుబావలెల్ల
విధివశమ్మునఁగానలవేఁగుచున్న
మీఱుసిరిగల్గియిటులుండమీరునాకు
దిక్కటంచునునమ్మితిఁద్రికరణముగ॥

చ॥ పురజనులందఱుంజెలఁగిపూర్వమునుండియుఁనీతనూజనా
పరసుతుభార్యయంచునని వారణవాక్కులఁబల్కుచుండిరా
పరువునునిల్పియన్యనకుపన్నిలకున్పను బెండ్లి సేయఁగన్
మరలకసాదరంబుగనుమాయభిమన్యునకీయుటొప్పగున్॥

క॥ చెల్లెంద్రమాటలన్నలు
చెల్లించుటలెస్సయగుటఁజితజీవుఁడుమే

నల్లుండభిమన్యునకును
బిల్లం దయచేయుమదియెఁ బ్రీతియనదగున్॥

క॥ ధనవంతు లయినవారికిఁ
దనయల నెవరైన నొసఁగెదరదిఘనంబే
పెనుబీదవానికిచ్చిన
ఘనునకె యిహపరములందుఁ గల్గుశుభంబుల్॥

బల- ఆహా! ఎంతచిత్రమైన మాటను వింటిని నేడు సుభద్రా! ఏదీ! ఇప్పుడు నీవు పలికిన ముద్దుమాటలు తనివిదీఱలేదింకొకమాఱు వచింపుము చెల్లెలా! నీకొమరునకు నాకూతు నీయవలయునో! నీకు సిగ్గేలేదు! ఆహా! పాడులోకము! తమకోరికఁ జెల్లించుకొను విషయమున నీప్రజలకుఁ యుక్తాయుక్తములు తోఁచవు గదా! రత్నమువంటి పిల్లను గొంతుగోసి నీకొడుకునకుఁ గట్టిపెట్టక పోయినలోటేమి? నీకొడుకునకుఁ బెండ్లి కాకపోయిన నెవరికిచింత? ఏమి మునిఁగిపోయె! బాగుబాగు! నీకోరికఁ జూడ నందని మ్రానిపండ్లకఱ్ఱులు సాచుటగానున్నది. లోకములో నొకముష్టివాఁడు తొలుత గుప్పెడుభిక్షమనుచువచ్చి యొకగడియ కూరుచుండనిచ్చిన భోజనాధి- యగును. అట్లున్నవి నీయడియాసలు!

మత్తకోకిల॥ కూఁడుగుడ్డలతోడఁ దృప్తిలి కూర్మినుండక పైపయిన్
గోడలం బువచించెదో బలె! కొల్లబోవునె భాగ్యముల్
చేడె! యేడగృహప్రవేశము సేయఁ జేతువె కోడలన్
జూడఁజూడఁగ నిట్లుదోఁచెనె! చోద్యమయ్యెఁ గనుంగొనన్॥

గీ॥ కామధేనువునింటనుగట్టిపెట్టి
కట్టెలకుఁ బ్రాకులాడెడు కరణిఁదోఁచు
యక్షరాట్తుల్యు లక్ష్మణు నవలవిడిచి
కొండద్రిమ్మరియగు పార్థుకొడుకుకీయ॥

సాత్యకి- (చిఱ్ఱునలేచి) అన్నా?

ఉ॥ అర్థిలి లేనిచో సుతను నాకపపౌత్రున కీయనంటివా
దుర్మదులైన కౌరవుల స్తోత్రము సేయుచుఁ బెద్దసేపు స
త్కర్ములఁ బాండుపుత్రులను గాఱులు పల్క సహింపవచ్చునే

ధర్మనిధాన! నీరసనదాల్చెదు సెట్లుమహాత్మదూషణల్॥

సుభ- (దైన్యముతో) అన్నా!

సీ॥ మృగరాజవిక్రములగుపాండుపుత్రులనెడఁబాసి మాయింటఁగడుపుఁగూటి
కిటులుంటచేఁగదా! యింతిపలుచనైతినైనఁబో చెల్లెలనగుదుఁగానఁ
దప్పేమియన్ననాతనయుఁడు లైస్సెనఁగోడలేరాకుండఁగొల్లవోనె
మున్నునీవాడినవన్నియేమాయెనువత్తాపహృతికంటెఁదప్పగలదె
తితినిదుశ్చింతులెద్దానిఁజేయఁదగరు
చెల్లబో! నేనుబోయెదసిగ్గువచ్చె
నింకనీవునుకురురాజునేకముగను
కట్టఁగట్టుకవేవ్రేలాడుఁడుట్టిగట్టి॥

విదూ- హలాయుధ! ఏడుతెరములనాటి లోఁడఁబుట్టినపడుము కనులఁదడివెట్టిన దండె మునమున్న వస్త్రముల గ్గినంటుకొన్నవఁట సుమీ!

సుభ- (కృష్ణునితో) అన్నా ఇంతేకద!

కృష్ణు- నే నేమిసేతునమ్మా?

గీ॥ నేనుబల్కెడుమాటలు నీళ్ళకన్నఁ
బలుచనగఁజూచియెప్పుడుఁ బల్కుసీరి
పాండవులయెడనాకెప్డు పక్షమంచు
గాననేనేమిసేతును కన్యపట్ల॥

మాయన్న నాకెపుడును పాండవపక్షపాతియనియే పేరుంచినాఁడు- నావలన నగున దేమియులేదు- నీవదిస్కగల చోటికిఁబొమ్ము-

బల- అబ్బ! కృష్ణునకెక్కడనులేని పౌరుషమువచ్చినదే!

కృష్ణు- సహోదరిసముఖమునకు వచ్చిన నాపై నతికఠినోక్తుల నొప్పించి పోనాడినమీ యట్టి ధర్మవర్తనులకుఁ బౌరుషముగాని ధర్మవర్తనులగు పాండవులయెడ ప క్షమువహించిన నాకు నిజముచేతఁ బౌరుషముండుటతప్పే.

విదూ- వహ్వావ్వా! కృష్ణుఁడు నామనసునకు వచ్చినవాఁడు తనలో (బెల్లముగొట్టిన రాయివలె హలాయుధుదూరకుండెను. ఏమనునోచూచెద)

బల- (కోపముతో చేతులుచాచి) వాసుదేవ ఈపె నర్జునునకిచ్చి యింతగాననుభవిం

చిత్రమి- ఇఁకశశిరేఖ నభిమన్యునకిచ్చి రెండుచేతుల జుట్టెదవుగాఁబోలు నేమి!

కృష్ణు- అన్న! ఇష్టస్వీకర్తగుసు కార్యములయందు దోషారోపణముఁ జేయుటకుఁగా ... ... ..అంసర్వత్రవిజయే,, త్తనుసాయ్యయమున సుధయందతి ... యుండుసు కావున నది వర్జనీయముకాదే?

(తెరలో)

ఉ॥ కిలకిలమంచుఁ గూయుచును గిములఁజేరెడుఁ బక్షిసంఘముల్
బలకలు మెల్ల మెల్ల నవలంకరణక్రియలన్ మెలంగెదర్
చెలువుఁడుసత్పథానుగమశీలుఁడు చల్లనిరాజువచ్చునం
చలరుచుఁ బూర్వదిగ్వనితయాసన మందను రక్తిఁజూపెడున్ ॥

బల- (సక్రోధసంభ్రమముగా) ఇఁక సాయంకాలమయినది కాలకృత్యములకను నే నేగెదను-

(నిష్క్రమించెను.)

కృష్ణు- బాగుబాగు! (తలయూచి) సుభద్రీ! నేనును కాలోచిత కృత్యములఁ దీర్పఁబోయెదను నీవు వగవకుండుము- నీబిడ్డఁ బెండ్లికాకపోదు- నీకోరికయెట్లో నట్లు జరగఁగలదు- నీవు ధైర్యముగా నుండుము- సేవక! మార్గము!

సేవ- అయ్యా! ఇట్టిట్లు-

(ఉభయులు నిష్క్రమించిరి-)

(తెరలో) పంచచామరము-

బలే! పసందు మేల్ శబాసు పార్థనందనుండు కా
నలందు వ్యాఘ్రి సింహ ఖడ్గ నాగశల్యపోత్రులం
బొలోపొలం మఁబట్టిచావ మోఁదిశౌర్యమూర్తి నా
విలక్షణంపు రూపుదోఁప వేటనుండి వచ్చెడున్ ॥

సుభ- (చెవియిచ్చివిని) అదిగో నాకొడుకు వేఁటనుండి వచ్చుచున్నాఁడు! ఇప్పటి మాటలతని కెట్లుచెప్పుదును-

అభిమన్యుఁడు- (ప్రవేశించి కొంచెము సేపుజూచి) అమ్మా! నీముఖవిలాసమున మిక్కిలి విచారమును మెల్లడించుచున్నది- కారణమేమి?

సుభ- (మోమువంచి యూరకున్నది-)

అభి- (సమీపించి) తల్లీ ఒకవేళ నడవులలో శ్రమలఁబడు నాపితృజనముకడనుండి యే మియు వర్తమానము దెలియలేదుగద (తొందరపాటుతో) వారికి క్షేమమేకద !

సుభ- (ముఖముప్రక్కకుఁద్రిప్పికొనుచున్నది)

అభి- (తనలో) అయ్యో ! ఈమె యేసంగతియుఁ జెప్పకున్నదేమికర్తము ? (కొంచెము యోచించి) కాని ! నాపితృజనము క్షేమముగనే యున్నారు- లేకున్న నీమె యిట్లుండదు- నాపైనేదేని కోపకారణమున నిట్లున్నదిగాఁబోఁచెదును- (తల్లి పాదములపైఁబడి సబాష్పగద్గదికముగా) జననీ !

సుగంధి॥ చిన్నిగోలనైననన్నుఁ జిక్కువెట్టఁబాడియే
యెన్నఁడైననీకుమాట సేవొనర్చనాడనే

సుభ- (కోపముతో నభిమన్యు నావలను గంటి తాను విముఖముగాఁదిరిగినది)

అభి- (లజ్జాక్రోధములతోఁ జిహాలునలేచి)

సుగంధి॥ అన్న కన్నతల్లికిట్టు లాగ్రహంబుఁ దెచ్చియుం
కెన్ని సేయనేమిలాభమీయసుల్ త్యజింతు-ఛీ ॥

(అనియొఱలోని కత్తిఁబెఱుకుచున్నాఁడు-)

సుభ- (దిగ్గనలేచి) అయ్యయ్యో ! దుండగీఁడ ! త్వరపడకుము ! త్వరపడకుము- (అని యొక్కయొకచేఁ జేయిపట్టికొన్నది)

అభి- (రోషముతోఁ జేయివదిలించుకొనఁ జూచుచు) అమ్మా ! మాతృదేవతాసహ్యావర్తనుఁడగు నీదుష్టుని మఱియొకతీరుగానిమ్ము-

సుభ- అబ్బాయి ! నీకోపమెంతమాత్రమును లేదు శాంతించుము-

అభి- అటులయిన మఱినీవిచారకారణమును జెప్పుము-

సుభ- (నిట్టూర్పువిడుచుచు) కుమార, అభిమన్యు-

చ॥ అలశశిరేఖనీకుఁ బ్రియయౌనని నేమువచిస్మియుండని
న్నలతిఁగజేసి కౌరవుల కర్పణసేయఁగఁ బూనెసీరి యా
ఖలునకు నెన్నఁడైన నపకారమొనర్చితినన్న లేదు సా
మ్ములమదిఁగోరివారలకుఁ బుత్రికనీయఁగనుద్యమించెమా ॥

అభి- (విఱునగవుతోఁగూడిన నైరస్యముతో) తల్లీ ! ఘోర ! ఎంతవెఱ్ఱిదానవైనీవు క్షోభించి నన్నుక్షోభ పెట్టితివి- బలరాముఁడు తనగర్భవాసజనితయగు శశిరే

ఖను దనకిష్టమయినవారికిచ్చుకొనుపట్ల నీయాటంకమేమి ?

సుభ- అదిగాదు కుమార ! బలరాముఁడు పిల్లనీననుట యెట్లున్నను నన్నీ దేహము డువఁదగినన్ని కాలులాడినాఁడు ఎట్లు వగవకుందును- ఆమాటలువినుము- బెట్టిన కూడును తానిచ్చిన గుడ్డను కట్టి మూలనుండక సకలైశ్వర్య సంపన్ను లగు తెకూతును నేకోడలనుట తప్పట- కొండద్రిమ్మరియగు నీతండ్రితో వి మంచుట కామధేనువను బోనాడి కట్టెలమ్ముకొనినట్లట వేయేల అన్నమా లన్నటులే జెప్పెదవినుము. (కూడుగుడ్డలతోఁడ, నవరసభక్ష్యాన్నము కామధే నింట ననుపవ్యములనుజదువుచున్నది-)

అభి- (పాముపలెబుస్సకొట్టి యతికష్టముతోఁ జెవులమూసికొని)

గీ॥ అక్కటా! పాపియాసీరియాడినట్టి
ప్రల్లదంబుల నేలనాయుల్లమవియ
వేలువేలుగఁ జెప్పెదుపీనులెంతొ
తూఁట్లుపడనిట్లసెనెనిన్నుదుర్మదమున॥

(మల్లఁజఱచి)

పంచచామరము॥ సరే! సరోజనేత్రినీయసాగకున్నఁబో! బలే
దురాత్ముఁడౌసుయోధనుణ్ణనుతుల్ కడంకఁజేసియా
పరేతరాట్సుతాఖులక్ ప్రభాకరాగ్నితుల్యులన్
గరంబునింద సేయ శేమికారణంబొ చూచెదన్॥

మ॥ బలరామాసులుయాదవుల్ మఱియునా పాపాత్ముల కౌరవా
ఖ్యులునీ రేజభవాదిసర్వదివిజుల్ ద్యోలోకముంభూమియున్
బెలుచందాకినరూపుమాఁపిజనకుల్ ప్రీతిల్లగానిప్పుడా
లలనంజేకొనిపెండ్లియాడెదనునాలాపందఱున్మెచ్చఁగన్॥

(అనిధనుష్టంకారము సేసిపోఁబోవుచున్నాఁడు)

సుభ- చేయిపట్టుకొని

గీ॥ కొడుక! నీవిప్పుడేగ మ్మూఖులలుగణింతు
కో! గయ్యాళియాసుభద్రమ్మయనుచు
బిల్లనీకున్నఁబోయెఁబో! చెల్లుగాక

మామపైఁగత్తిఁగట్టుటమానుతండ్రీ?

అభి- పెనిమిటినివిడిచిపుట్టినిల్లేసౌఖ్యదాయకమనియెంచుమూఖులు లోకములోఁబలు కష్టములనొందెదరుసుమీ?

గీ॥ "భర్తకైయగ్నినైననుబడఁగవలయు" ననున్యాయమెఱుగవే

సుభ- నాయనా! ఇందునాలోపమేమియులేదు. నేను వెంటవచ్చెదనని యెంతవిలపించినను నిసుగువైననీసంరక్షణమునకై నన్నిచట నుండుమని నీతండ్రినాకాజ్ఞ ఇచ్చినారు.

పరిచారిక- అమ్మా ! భోజనసమయమయినది దయచేయవలెను.

సుభ- కుమారా ప్రాతఃకాలమున భుజించివేటకయి జని అలసివచ్చితివి- ప్రొద్దుపోయినది భుజించినవెనుక యోచింతములెమ్ము-

(అందఱు నిష్క్రమించిరి)

ఇదిద్వితీయాంకము.



శ్రీ

# బలజా సౌభద్రీయము.



## తృతీయాంకము.

రంగము-శశిరేఖాంతఃపురము.

(అప్పుడుచంపకమాలప్రవేశించుచున్నది-)

(తలపంకించుచు) ఔర! ఇంతలేసి శౌర్యములుండునా గాఁబోలు! నిన్నరాత్రి సుభద్ర; కౌమునతోఁగూడ నెచ్చటికోఁ బోయినట్లు వదంతికలిగినది. ఎచ్చటికోయేమి? పాండవులకడకే కావచ్చును. ఔను! కాకేమి? బలరాముఁడాడిన మాటలకు సుభద్ర యింకయుఁ బరమశాంతురాలుగనుకనే యోచించుకొన్నది. మఱి నాబోటిది గావలసినది! అప్పుడె ప్రాణత్యాగముచేసియుండును! పోయెఁబో! ముందీసంగతి శశిరేఖ వినినంతనే యాపెనెట్లుపట్టఁగల్గునుము దైవమా! ఇది వఱకే యభిమన్యుని మనసుదీఱ తలఁచు చూడనైతినని కడువిలసించుచున్నది. ఇప్పుడీసంగతి మఱియు మిక్కిలిగాఁ బొక్కునుగద! కానిమ్ము! ఎల్లెట్లో జరుగగలదు. (ప్రక్కఁజూచి) అదిగో శశిరేఖ సఖీసహితముగా నీవైపునకేవచ్చుచున్నది. నేనింకొకదెసకేగెదను. ఈసంగతివానోటఁజెప్పలేను-(నిష్క్రమించెను)

ఇదిప్రవేశకము.

(అంతటశశిరేఖయు సఖులును బ్రవేశించుచున్నారు)

శశి- సఖీ! శీలవతీ! ఈమధ్య నాహృదయమేమో వాచామగోచరమయిన యవస్థనొందుచున్నదిగదస్మ్మ !

శీల- చంద్రముఖీ! మనశశిరేఖహృదయసంభ్రమకారణము నీవేమయిన నెఱుఁగుదువే!

చంద్ర- గుణ[illegible]రాలవగు నీవనుగ్రహించవలెను. నేనుచేరునకేపెద్దన

శీల- అటులయ్యిన నీమగండు మిగుల పన్నెలకుప్పగదా! నీవెట్లు,

మధురవాణి- మీలోనఁబూరు కయ్యములాడుటయే కాని శశిరేఖ వంత బాపరైరి.

చంద్ర- ఆపనిసేవి. నేనలాలుకు తియ్యని మాటలచే సఖురాలి సంగతియు వాపగసను

మధు- సరే, నీమాట నేల వ్యర్థము సేయువలెను. నాకిట్లుతోఁచుచున్నది వినుఁడు.

గీ॥ వయసువచ్చినతోడనె వనితలకును
మగనిజతగూర్పఁ జేలకో మహినిబ్రజలు ॥

చంద్ర- (చప్పట్లుగొట్టుచు) ఆ! తెలిసినది! శశిరేఖ మనోవ్యథకు కారణము నాకును తెలిసినది!

గీ॥ బంతులనుమీఱికుచములీపగిదినుండఁ
బాపమీబిడ్డ మనసెట్లువశమునొందు ॥

శశి- సకోపముతోఁగూడిన చిఱునగవుతో) మదవతులార! మీతోఁజనవిచ్చి ముచ్చటించుట నా చేతప్పు.

శీల- అబ్బ! మన స్త్రీజనమునకున్న మహాధనమే యీబెట్టు! తల్లిపుట్టిల్లు మేనమామకెఱుకయన్నట్లు నీనక్కజిత్తులన్నియు నాయొద్దనా శశిరేఖా? విను మఱి-

గీ॥ బలియుఁడును రూపవంతుఁడు భాగ్యశాలి
యైనమగనినిగూడిసౌఖ్యంబునొంద
నమ్మరో! చిత్తచాంచల్యమూపలుంటె
నిమ్మతిదుర్దిదిస్వర్గనిభమ్ముగాదె ॥

శశి- (అఱమోడ్పుతోఁబారవశ్యమునొంది) అమ్మలార! చల్లగవచ్చి ముంతదాఁచనేల? నేనును నాప్రాణనాథుఁడై - (నిట్టూర్పువుచ్చుచున్నది-)

శీల- చెప్పుము- చెప్పుము- అభిమన్యుఁడును-

శశి- (లజ్జాహర్షములతో) యింతనాటనుండియుఁ గలసి మెలసి యాడికొనుచుంటిమిగద! ఇప్పుడీరాణివాసమను కారాగృహమునఁబడి యామహాభాగునిఁజూడకుండ నెన్నినాళ్లు గడపఁగలనో?

మధు- అమ్మా! ఎప్పుడును సంతతసాన్నిధ్యముచే నంతమోహముండదు. తొలుతనీతీరుగ ననోన్యవశనాకాంక్షచేఁ [illegible] గనుండదు. దైవానుగ్రహమున [illegible] గనప్రవసనమానమువన [illegible]

శశి- ఆహా! ఏమి తేనెలొలుకుచు నాపరితాపమణంచినవే నీతియ్యమాటలు!! ఏమైనను నామనస్సంతకంతకు వశముతప్పుచున్నది- ,,గతకాలము మేలువచ్చుకాలముకన్నన్" ॥ అనునటుల వెనుకటిదినములన్నియు దాఁగుడుమూఁతలచేతను, గుజ్జనగూళ్ళచేతను, బొమ్మలపెండ్లిండ్లచేతను' అతిసౌఖ్యముగ వెడలింపఁబడినవి- (సబాష్పగద్గదికము గా) ఆదినములిఁకజూడఁబోముగద! ఇప్పుడంటివో! యసంఖ్యాకములగు మనోవ్యథలునన్ను బాధింపఁదొడంగెను. నాకిప్పుడేమియోగాని మిన్నువిఱిగి మీదఁబడినట్లున్నది- ఏమిసేతును?

చంద్ర- ఆశేషజనరంజకంబగు నుద్యానవనమునకుఁ బోవమురమ్ము. అచ్చట సుఖముగఁ బ్రొద్దుపుచ్చెదము.

శశి- సరే, మీయిష్టము- నడువుఁడు.

అందఱును (లేచినడుచుచున్నారు.)

చంద్ర- (ముందుచూచి) ఓహో! సఖీ! ఇదిగోయుద్యానము-

అందఱును-(ప్రవేశించిరి.)

శిల- తరుణీ! నీవలెనేతరుణమయిన జిగిగలయీయుద్యానవనముఁ జూడవమ్మా! ఇచ్చట.

గీ॥ బొద్దుమల్లెలువిచ్చియీభూమినంతఁ
గప్పెసౌరభమదిగాక కప్పురంపు
టనఁటిచెట్లులసొబగునీయందమయిన
యూరువులతోడవియ్యమునొందుచుండె॥

మఱియు శుభసూచకంబులనేకంబులు పొడగట్టుచున్నవి. ఎట్లంటివో?

మ॥ చెలి! చూతారుణపల్లవంబులనుభక్షింపఁగామదంబెక్కి కో
కిలసంఘంబులుమూర్యరావములునాగిపెట్టనీ తేంట్లువే
శ్యలనన్ ,,రీ" యనిమేళగింపుసలుపఁగా శశ్వత్క్వణత్కారముల్
లలిస్వస్తుల్పచరింపువిప్రులనఁగళ్యాణంబునీకొప్పెదున్॥

శశి- (నీరసభావముతో) ప్రియసఖీ! మందభాగ్యులకొక్కెడశుభమ్ము సేసటు నే? ఈయుద్యానమునఁబ్రొద్దుపుచ్చుటకువచ్చిన నాకిచ్చట నేటికెదుఱీమటలైనదే!

ఉ॥ చూతములెల్లఁబూయ, సిరిచూలియఖవే రణలేఖవాఁయనెం
తోతమకంబుమీఱఁబికయూథముగూయ, ద్విరేఫసైన్యముల్

ప్రీతిగఁ బ్రోయ, నామనస్సుఖీతినిముగ్నెడుం మందమారుత
వ్రాతము దేహమంతట నువహ్నివిధంబునఁ గాక వెట్టెడున్॥
ఆహా! అలబ్ధఫల మనోరథులకివియన్నియుఁ బరమశత్రువులుగదా! (నిట్టూర్పుతోఁ జదికిలఁబడుచున్నది)

మధు- సఖీ! ఇంత చేతఁగానిపని చేయుచుంటివేమి? మానవతులు తమ సౌందర్య సౌశీల్యాదులచేఁ బురుషులు తమకు వశులగునట్లు సంచరింపవలయును కాని యిట్లు బేలతనము గానుండనగునా! (లేవనెత్తుచున్నది)

శశి- (అటునిటుఁ జూచి)

గీ॥ కడఁగి యేడాకు లనఁటినిగాఁ గలింపఁ
దాపవిశ్రాంతియగునో! తలఁచిచూడఁ
గానినా బోఁటిగత్తెకుఁ గష్టమదియుఁ
దాపమార్పంగఁ గల్గుటతలిరుఁబోఁడి॥

(అప్పుడేటాకులనఁటిచెట్టును గాఁగలించికొని యులికిపడి)

గీ॥ ఉవిద! సల్పఁగ సప్తపర్ణోపగూహ
నము నుదుస్సహతాపోపశమనమునకుఁ
గేవలంబుగ వైరుధ్యభావమొందె
హుతవహు శమింప వేల్చినఘృతమువోలె॥

మధు- ఇప్పుడు నాకొక్కయుపాయము తోఁచుచున్నది.

శశి- (తొందరతోడి దైన్యముతో) అదేమో సెలవీయుము తల్లీ!

మధు- ఆఁ! ఏమియీ శశిరేఖయనునయము?

శశి- (కోపముతోఁ బుల్కుపుల్కునఁ జూచుచు) పిల్లికిఁ జెలగాటము ఎలుకకుఁ బ్రాణసంకటమనునట్లు మీ రిప్పుడు నన్నుఁ బరిహసింపక మఱేమి చేసెదరుఁ? (కన్నీళ్లు విడుచుచు) మీరింత కఠినహృదయులు

మధు- నెచ్చెలీ! కోపము సేయకుము ఎవ్వరికి నియౌవనచాపల్యమే నీప్రియుని యాకృతిని జిత్రపుఁ బల్కపై లిఖించి చూచికొందువేని కొంత తాలయూపనము కాఁగల్గును.

శశి- (ఆలోచించి) సఖీ! (నిట్టూర్పుతో) అచికొనసాగదే? ఏమా?

గీ॥ వాసియాననమాత్రంబె వ్రాయునంత

గుం దెరఁబ్లి నియక్కటా! ఘోరముగను
గన్నులను వేఁడిబాష్పములుఁ గ్రుమ్మరించి వేయఁ
బూను నా మొగమింకెటు పూర్తిసేతు॥

(తలపకించి)

కానిమ్ము! అంతవఱకైన వ్రాసి చూచెదను? (పలకపై వ్రాసి)

ఓహోహో! (అని మూర్ఛబోవుచున్నది)

సఖులు- (పన్నీరుజల్లి లేవనెత్తుచున్నారు)

శశి- గీ॥ తెల్లఁదామరలను నవ్వి కొల్లలాడుఁ
బోల్ల సవ్వల్ల భాగ్యమో చెల్ల వినవె
అదియు యస్కాంతమాయసమట్టిలాగు
భంగి నా మనసును వశపఱచుకొనియె॥

చేటి- సఖీ! నీవు బొత్తిగ నలసియున్నదానవు. కొంచెము సేపు సెజ్జపై బవళించి నిద్రించుము.
చిత్తైకాగ్రతతో నున్న నీకు కలనైనను బ్రియదర్శనమగు నేమొ?

శశి- ఊఁ! అదియును ట్టిదే.

గీ॥ వల్లభుని బాయుదానవపావకునికన్న
నెక్కుడగు వేఁడి మనమును ద్రుక్కఁజేయ
నెక్కడిది నిద్రసుఖమేద నింతయున్న
లోపమే నిటుఁ గల్గు నెలోలనేత్రి॥

కాబట్టి మనయీయారంభములన్నియు నిఁక నట్టివి. నేనొక్క పరమార్థంబు సె
ప్పెద వినుండు చంద్రుఁడు లేక కుముదము వికసింపదు. కావున నప్పుడు శరణమువ్వ
తియో.

సఖులు- అబ్బ! అట్టులనిమా డెంపంబులు నీయసేయకమ్మా.

శశి- లేక ప్రియజనగాఢాలింగనసుఖస్థితియో.

(తెరలో) తథాస్తు తథాస్తు

అందఱును (చెవియిచ్చి వినుచున్నారు)

శశి- మన చేటియగు సీమంతినివలెనున్నది. ఏదో మంచిమాట వినఁబడునట్లున్నది-

సీమంతిని- (ప్రవేశించి)

గీ = నీకుఁ బెండిలి యయ్యెడు నీరజాక్షి
యెల్లిసుముహూర్తమనుచుని తల్లిఁ నన్నుఁ
బెండ్లి సింగారమును జేయఁ బ్రేమమీఱఁ
బోడితెమ్మని నన్నంపెఁ బూర్ణముగను॥

శశి- (నిర్విశేషానందపరవశయై) చేటి ! ఈకంకణమును జేకొనవే- (అనియిచ్చు చున్నది-)

సీమం- (పుచ్చుకొని) అమ్మలార ! త్వరగా లెండు

అందఱును- (లేచి నడుచుచున్నారు)

సీమం- (ముందుచూచి) ఇదిగో గృహము. రేవతీదేవి నీకొఱకై నిరీక్షించుచున్నది.

అందఱును- (లోపలఁ బ్రవేశించిరి.)

రంగము- రేవతీదేవియంతఃపురము.

(రేవతికూర్చుండి యుండగా సఖులతోఁ గూడ శశిరేఖ ప్రవేశించుచున్నది.)

రేవతి- (శశిరేఖను గౌఁగలించుకొని) పుత్త్రీ ! ఈదినమొక్కసారి యయినఁ గనఁబడ లేదెక్కడుంటివింతసేపు ?

శశి- తల్లీ ! ప్రొద్దుఁబుచ్చుటకై యుద్యానవనమునకుఁ బోతిని-

రేవ- సరే ! ఈపీఁటపైఁగూరుచుండుము నీకలంకరించవలెను.

శశి- (పీఁటపైఁగూరుచుండి) అమ్మా ! నాకీపునరలంకారకారణమేల ? నేనింతకుముందే కద యలంకరించుకొనినది.

రేవ- అదియంతయు నలంకారముగాదు- ఇప్పుడు నీవు వివాహాలంకృతవయ్యెదవు.

శశి- (తనలో) హృదయమా ! ఇఁకనైన స్తిమితపడుము-

రేవ- (అక్షతలు చేతఁబట్టుకొని)

క॥ నీయత్తకడుపుచల్లగ
నాయతిమైమాతృగర్భ మదియునునట్లే
యైయెల్లప్పుడొప్పెడు సిరి
రాయానికృపగల్గునంత రాయరహితమై॥

(అక్షతలు శశిరేఖశిరముపైఁజల్లి) పరిచారకలారా ! ఇఁకమీరు మీమీయుత్సవములఁ జేసికొనుఁడు- నేనేగెద.

(నిష్క్రమించెను-)

శశి- సఖులార ! ఇదియె నాకానందసమయము- సరస సల్లాపములతోఁ బ్రొద్దుబుచ్చ రమ్మా.

గీ॥ మనసుకోరికదీఱంగ మంచిసమయ
మిపుడచేకూరెసఖులెల్ల నిచటనుండి
రహహా ! యీసుఖమునకంటె నరయనెట్టి
సుఖముసుఖమన్న నెంతురేసుదతులార ॥

మధు- మనసరససరసనుండ సరసతులకేమికొదువ.

సరస- (తనలో) ఈమె నాకే తాటియాకులు గట్టుచున్నది- దీనిసేరీతినైనను జిన్నబుచ్చెదను- (పైకి) మధురవచనా ! నీవెవనియందేనో గంటుకనఁబడుచున్న దేమమ్మా?

మధు- గీ॥ కల్కి ! రాజిల్కసుధజిల్కఁ జిలికిపలుక
బ్రేముడించిముద్దాడంగఁ బెదవిఁ గఱచె

సర- ఓ ! గీ॥ పతులకుఁబండ్లపైఁబ్రియ భావముంట
దొండపండనికాఁబోలు తోయజాక్షి ॥

శశి- సరసవచనా ! మధురవాణి వివాహమయినదిన్నదిగదా నీకీయనుమానమేలనే ?

మధు (రబ్బసముతో) అవునులే నీకును రేపటితో నాయాటంకముతీఱునుగా!

శశి- (వెనుకకుఁజూచి) ఇదిగో మనచంద్రికవచ్చుచున్నది.

చంద్రిక-(ప్రవేశించి) సకియా ! ఏమిచెప్పుదు నీయదృష్టము!

సీ॥ జాకాసనాయిలుబాగుగా మ్రోయంగఁ దూర్యరావమ్ములతోడమించి
తెల్లవాఱినభంగి దిశలెల్లదీపింప వేలుమత్తాబులు వెల్గుచుండ
దేవాంగనాసమదేహాలువేశ్యలు చిత్రిలాస్యంబులుసేయుచుండ
వందిమాగధరాజి వందనంబులుసేయ సకలవిద్వజ్జన సహితముగను
విపులరథ హయ గజ సైన్య విస్తరాతి
పాదఘట్టననిర్గతబహుపరాగ
చుంబితాకాశులైకడు సొంపుమీఱ
వచ్చివిడిసిరిమరరాజ వైపువారు ॥

శశి- ఆశ్చర్యమాశ్చర్యము!! పాండవులకును గౌరవులకును బద్ధవైరముకాదటే! అట్టియె

డఁ బాండవకార్యమునకుఁ,, గురురాజువై పువా, రేలవచ్చెదరు?

చంద్రి- ఇదికడుఁజిత్రముగనున్నది! బలరామపుత్రికవైన నిన్ను దుర్యోధనపుత్రుఁడైన లక్ష్మణునకిచ్చుచుండ నిందుఁ బాండవులెచ్చటవచ్చిరి? వారడవులలోనె.

శశి- (విషణ్ణతతో) నిజమే నాసఖీ! (తొందరపడుచున్నది)

చంద్రి- నీతో నే నెప్పుడైనన బద్ధముసెప్పతినో?

శశి- (దేహముకంపించినోటఁదడియారగద్గదస్వరముతో) హా? పాపఁపుదైవమా! నే నేమి తప్పు జేసితినని నన్నిట్లు మరణశరణము గాఁ జేసితివి? (అని నేలఁబడియేడ్చుచున్నది)

సఖులు-(నిరుత్సాహలయి విన్నబోయినముఖపద్మములతో) అమ్మా! లెమ్ము. ఇంకనువిచారించినిజమును దెలిసికొందము. అంతకునదియేనిశ్చయమయినచో నిట్టి విరోధులగు శశిచంద్రులతోడి పొత్తునీకేల? మన్ననయేల? ఎట్టులైననీ కోర్కెఁ జెల్లించెదము లెమ్ము.

శశి- (లేచి) సఖీ! నాకేమియుం గానరాకున్నదిసఖీ! ఇక్కడకునామనోరథమింతపూర్తియయినది. మఱి నాప్రాణసముఁడయిన సుభద్రానందనుఁ డెచ్చట నేమి సేయుచున్నాఁడు?

చంద్రి- ఈవార్తనువినఁగా నేతల్లితో నడవులకుఁ బోయినాఁడు.

శశి- కష్టము హాకష్టము! అయ్యో! క్షతముపై క్షారముగూడపడినదా? ఓప్రియతముఁడ! పూర్ణిమాసుధాంశునిబోలునీ నెమ్మగముఁ గఁ జూతునా?

(అనిమూర్ఛబోవుచున్నది)

ఖులు-(అనేకశైత్యోపచారములచేఁ దఁ దేర్చుచున్నారు)

శి- (లేచి) తండ్రీ! నీకెంతవిరోధినైతిని! ఓతల్లీ! లోకములోఁదండ్రులెట్లున్న ను దల్లులుపిల్లలఁ బ్రాణతుల్యలుగఁ జూతురనియెదరు. అట్టియెడనీకును చ్చెడితినో? సుయోధన! నీకుమారునకునన్నుఁ గూర్పఁబోవుట కాకిముక్కునకుదొండపండుగట్టుటగదా! లక్ష్మణా! అలభ్యారంభము జుమీనీకోరిక! హాప్రాణనాయక! నాతండ్రిధనికవశంవదుఁడై నన్నీయనన్నంతమాత్రమున నన్నుదరిలేనివియోగసాగరమునముంచిపోనగునా? నామనసేమికట్టితివి? దానిని నీకిదినటకేయిచ్చియుంటిని కాదా? అయ్యో! మగవారికేమికొఱఁత? వారెటులైనఘనులే. (స్వనైరాశ్యాందోళనముగా) ఓసఖి! ఈప్రపంచకమంతయు గాఢాంధతమఃపరిపూరితమయినట్లు

న్నదే. (ఉలికిపడి) అబ్బ! ఏమియీమలయవాతము! నిప్పులుగురియుచున్నది గదా! (దక్షిణదిశోన్ముఖియై) ఓచందనజన్మ! మహాభాగ!

గీ॥ దక్షిణంపుదిక్కు యమునకు స్థానమండ్రు
తలఁపనీకును స్థానంబె దానఁజేసి
యేకసంస్థితిదోషము దేవఁబోవుఁ
బ్రాణిహింసయె యెప్పుడుఁబనులు మీకు ॥

[అప్పుడు చంద్రముఖినిఁ గౌఁగలించుకొని]

పంచచామరము- సరోజనేత్రి రోసఖీ ప్రచండమారుఁ డేఁచి యా
ద్విరేఫకీరశారికాదివీరసేన గొల్వఁగన్
గరంబు నాయురంబు నేయఁ గాశరంబు బూనెనో
వరాళివేణి నేవిరాళి బారిఁదాళ నేకటా ॥

(ఆకాశము వైపు చూచుచు)

హా! కామదేవ! సంకల్పసంభవ! పుష్పబాణుఁడవైన నీకింతవేఁడి యెట్లు వచ్చినదోయి? నేనొక్కటి యూహించెద.

గీ॥ తొల్లి శివఫాలవీతిహోత్రుండు సోఁక
భస్మమాత్రుఁడవైతివి భావజాత
దాని లేశము నీవింక దాఁచియుంటి
వేమొ! లేకున్న నీతాపమేలఁ గల్గు॥

(సక్రోధముగాఁ దలపంకించుచు) కానిమ్ము అబలనగు నా శాపము ప్రతిహతము కాదు!

గీ॥ నీకు పువ్వులతూపులు నేలఁ గూలు
నీదు మీనంపుఁ డెక్కెంబు నీటఁ గలయు
నీదు విల్లెప్పు భక్ష్యమై నీరసించు
నాగుదతిఁ జేరకోపో తినయ విమార।

ఓ రామనోభవా! నీవు పుట్టినిల్లు గుట్టు బెట్టఁ జలపట్టు పట్టినకట్టెఁడివి. నామనంబునఁ బుట్టి దానినే యాయష్టపెట్టుచుంటివి, దుష్టజంతువులను పాలానంబు సేయఁ జనదు. పామునకుఁ బాలుపోసి పెంచినట్టుల బ్రియుజనసమావేశాకాంక్షాపరంపరల చేనిన్నుఁ బెంచితిని. నిప్పుఁ బొట్టన్నారకవిడిచిపెట్టెదవా? (అప్పుడు క్రీడాశుకము కవకవంగా యనదిరిపడి) ఓసీపక్షీ! ఏమి

బాగనవే! చిన్ననాటనుండియు నాచేఁ బెంచఁబడి యిప్పుడు మన్మథుఁదత్తడివైతివనికా బోలు నన్నుఁ జిక్కుఁబెట్టుచున్నావు! సరే! మంచిదిలే! (కొంచెమాలోచించి) అమ్మలారా! నాకేమిగతిఁ జెప్పెదరు?

శిల- అమ్మా! నీతండ్రి తాను దుర్యోధనుని వియ్యంకుఁడనని పించుకొనఁ జూచినాఁడు గాని నీయిష్టమెట్లో యించుకయు నాలోచించిన వాఁడుగాఁడు. అట్టిస్వలాభప్రవణుఁడగు తండ్రితండ్రియో? అదియునుఁగాక నీవు త్రికరణశుద్ధిగ నభిమన్యు వరించితివి. ఇప్పుడు వేఱొండుపురుషునిఁగూడితివేని దోషము వాటిల్లును. పతివ్రతలయిన యుత్తమ నాయకలు తాము వలచినవానిఁ గాని యెట్టియిక్కట్టులయందైనను వేఱొకని వరించరు. కాఁబట్టి నీవిప్పు డొకపనిఁ జేయుము. జాబునొకదాని వ్రాసి నీప్రియునకుఁ బంపుము. ఇదివఱకు నీయనురాగమున్నంతగాఁ జవిచూడనందున నిన్ను విడిచిపోయినాఁడు. నీజాబునుజూడఁగనే వచ్చి నీకోర్కెఁ దీర్పఁగలఁడు.

శశి- అవును నిజమే అట్లుచేసిన నతఁడు వచ్చి నరాఁగలఁడు కాని నాఁడప్పుడె ప్రాణత్యాగము సేయుదానను.

(జాబువ్రాసి త్వరగతియను చేటికిచ్చి యనునయపూర్వముగా)

చ॥ త్వరగతి! నీవు వోయి యలపార్థజుఁ గాంచి మదీయవార్తలన్
సరణిగఁ దెల్పి వానిమది చక్కఁగఁ ద్రిప్పి యెటైన నీదుచా
తురిఁ బ్రదరించు మింప్రియముతోఁగల నేర్పులఁ బుజ్జగించి నా
స్మరజదవాగ్ని నార్పఁగను సత్వరఁ దేగదె సన్నుతాంగునిన్॥

(అని చేతనున్న రతనాలకంకణమీయఁబోవుచున్నది)

చేటి- అమ్మా! నీచేతికంకణము నీయకుము. నాకు నీయనుగ్రహమే కావలయును.

శశి- (చేటిచేతులుబట్టుకొని) అమ్మీ! త్వరగా రావలెనుసుమీ!

చేటి- వేయేల? చూచెదవుగా! అచ్చట భుజియించి యిచ్చటఁ జేయికడిగికొనునట్లు వచ్చెదను. సరేగద! (నవ్వుచు) నాపేరెవరు? హుఁ! (నిష్క్రమించెను)

శశి- (నిట్టూర్పుతో నాకసమువంకఁ జూచి) అబ్బా! ఈపాపపుచందమామయు బయలుదేఱినాఁడే! ఓరీ! చంద్ర! నిప్పులఁగురిసెదవే? మంచుకురియునగు నీకీయుష్ణమెక్కడిదోయి? ఔను! నీకిది సహజమేగా?

గీ॥ పాలమున్నీటజన్మించిపావకుండు
నీవునిరువురుసహజులై నెగడితిరిగ
కానసహజానుగుణ్యదుష్కర్మ మీక
కెట్టులబ్బకయుండెడుకట్టచంద్ర॥
ఔరా! నీ పేరు మోసికొని బ్రదుకుచున్నన న్నేహింసింపవలెనా?

ద్విపద॥ హాచంద్రతారేంద్రహాదోషసాంద్ర
చూచుచుండఁగనింతచుల్కనబుద్ధి
యెటులఁగల్గెనో తెల్ప నేఁజాలనీకు
కుటిలాత్మ నీతోడఁగూడిపుట్టిరిగ
యలపాలమున్నీట నైరావతంబు
తలఁపసుధాఘటధన్వంతరులును
కౌస్తుభరత్నంబుకల్పవృక్షంబు
స్వస్తిస్వరూపిణిసర్వేశురాణి
వారలందఱునునీవలెజీవహాని
కారులై రొకో చూడుకల్మషహృదయ
నినుఁబాముకఱచుటనీకళలన్ని
యునువియచ్చరులుభక్షణసేయుటయును
మొదలుగాఁగల్గినమోసంబులన్ని
యొదవకుండిననునీవొదిగియుండెదవె
హరుబండిచక్రమ్మైయమరినఁగాని
మరణంబునొందకమఱియుంటివెట్లు
గురుభార్యఁబొందినక్రూరుఁడవగుటఁ
జిరజీవివైయిట్లుచెలఁగుచుండితివొ
అక్కటా "పాపీచిరాయు" వన్మాట
నిక్కమయ్యెర యామినీచర శ్రేష్ఠ॥

(చేతులుజోడించికన్నులుమూసి)

ద్విపద॥ హాదైవమాయిట్టియాపదనాకుఁ
బాదుకొల్పుటనీకుఁబాడిగాదకట

యెప్పుడే పాపంబు నేఁ జేసినాను
యిప్పుడీ వెతలకు నెఱఁ జేసినావు
అక్కటా కరహాబ్ధియడుగున ముంచి
యిక్కరణిఁగ నేఁచ నేమి న్యాయంబు
నీకింత నాపయి నిష్ఠురమున్నఁ
జేకొని యొకసారి చెండాడరాదే॥

(యెలుగెత్తి గద్గదస్వరముతో)

హా లోకరక్షక! నాపై నీకింత కక్షయేల? నీవింత శ్రమపడ నేల? నిన్ను సుఖపెట్టుటకై నేనసిద్ధమయ్యెదను. చూడు! (అని పైఁట కొంగు చేతఁబట్టుకొనుచున్నది)

(అంతరిక్షమున)

క॥ చెలియా దుండగము దగుము
పలుగాకులు మూర్ఖులెన్ని పల్కిన వినకు
త్వలపతేఁ రక్షణ! శ్రీకృ
ష్ణులదయ నభిమన్యుఁ గూడి సుఖియింతు బలే॥

శశి- (చెవియొగ్గి విని యాశ్చర్యహర్షములతో) ఓహోహో! నేనెంత పుణ్యము జేసికొంటినో! ఎండలో నెండి యుండియున్నవానికి మేఘాడంబరధ్వనివోలె నీవాక్యము నామనస్తాపముఁ గొంతచల్లార్చినది! ఇదెవరు వచించిరో! కొంచెము యోచించి ఇది యాకాశవాణి సూక్తిగానచ్చును. ఆకాశము వైపు చూచి ఓయాకాశదేవత నీపాడితప్పనిదానవు తప్పకనన్ను నావల్లభునిఁగూర్తువేని యిప్పుడె యీభూషాలంకారములన్నియు నీకు ముడుపుగట్టి నీకీర్తిమాత్రము నానోటఁగట్టికొని తిరిగెదను, (కొంచెము స్తిమితపడి) అబ్బ! ఇప్పటికొకతీరైనదే నామనోవ్యథ! సఖులారా! అమృతతుల్యమగు నీవాక్యము వినఁగా నేను సుఖపారవశ్యమున నిద్దుర వచ్చుచున్నది. పాపము! మీరును బోయి నిద్రించుఁడు. నేనును నిద్రించెదను.

సఖులు- అమ్మా! మానిద్దురకేమి? ముఖ్యమైన నీవు సుఖముగ మాకు దక్కితివి. ఇఁక మాకును సుఖనిద్రగలుగును సెలవిమ్ము.

అందఱు- (నిష్క్రమించిరి.)

ఇతి. తృతీయాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## చతుర్థాంకము.

### ఘటోత్కచాశ్రమము.



(నిలిచియున్న పింగళుఁడును మూర్ఛపడియున్న కరిబలుఁడును ప్రవేశించుచున్నారు)

పింగ- ఓహో! కరిబలుఁడు మూర్ఛపడియున్నాఁడు. (సమీపించి) ఓరి కరిబలుఁడ కరిబలుఁడ! (అని చేతితో బుజముపైఁ జఱచుచున్నాఁడు.

కరి- (కన్నులువిప్పిచూచి) నాయనా! పింగళుఁడవు కాఁబోలును ఈదినమున నాకరిబలమంతయు గంగపాలైనది.

పింగ- ప్రాణసఖ! ఏమి యిట్లుగాఁ జెప్పుచుంటివి?

కరి- చెప్పెదనుగాని ముందునా దేహమున నాటుకొనియున్న యీ బాణములను బెఱికివేయుము.

పింగ- (అతికష్టముతో నలుగులను తీసి) మిత్రుఁడా మెల్లగాఁ జెప్పుము.

కరి- (నిట్టూర్పువిడుచుచు) ఏమిచెప్పుదునోయి! ఈదినమునఁ జంద్రబింబమును దొంగిలి ముఖముగ నమర్చుకొనిన యొకసుందరియు మన్మథుని యపరావతారముగు నొకకుమారుఁడును మనవనముఁ బ్రవేశించిరి.

పింగ- నరులకీ యరణ్యము గమ్యమే! ఎట్లువచ్చిరి?

కరి- పింగళా! మొదటినుండియు నీగుణము లేనిపోని ప్రశ్నలు వేయుట కాటపట్టే నేనో? ప్రస్తుతము కొనయూపిరితో నున్నాను. నేఁజెప్పెడుమాటలు నోరెత్తక నిదానముగా వినుము లేనిచో నన్నేల పీడించెదవు నాయనా?

పింగ- అవును ప్రస్తుతము నీవు బొత్తిగ వీలుదప్పియున్నావు ప్రశ్నలు వేయనులే! చెప్పు పాపము! !

కరి- ఆచిన్నవాఁడు నిర్భయుఁడై మనవనమంతయుఁ దిరుగుచు మార్గావరోధములగు వృక్షములను నఱకుచునుండుటఁజూచి యానరులనిరువురఁబట్టుకరండని మనప్రభువగు ఘటోత్కచుఁడు నాకాజ్ఞనీఁగా నరమాంసములభించెనను ప్రీతిమనమున ముప్పిరిగొననట్టహాసముఁజేయుచు బిఱబిఱఁజనుదెంచువఱకెచ్చటనుండియో యొకబాణవర్షము గుబగుబవచ్చినది. నేనంతఁబడి లేవఁజాలక యిచ్చట మూలఁబడిని నీవు లేపగానూపిరిఁ దెచ్చుకొన్నాను. తరువాత నేమిజరిగినదో నాకుఁదెలియదు!

పింగ- ఓరీ! గట్టిగానఱకుము ఆరాచపిల్లవాఁడిప్పుడు మననెత్తిపై దైవమయినాఁడు.

కరి- (చివాలునలేచి) అదెట్లుబాబూ!

పింగ- నీవపజితుఁడవైనతరువాత స్వయముగా ఘటోత్కచుఁడే వచ్చినాఁడు అప్పుడు వారిరువురకును ఘోరయుద్ధమయినది. అన్యోన్యమపజితులుగాక బ్రహ్మాస్త్రప్రయోగములకై ప్రయత్నించుచుండ భగవంతుడగు వేదవ్యాసుండు ప్రత్యక్షమై వారిరువురకుఁగల బంధుత్వములు దెల్పిసంధిజేసినాఁడు.

కరి- ఔర! విపరీతము ఆబంధుత్వము చెప్పవేమోయి?

పింగ- మనరాజుగారి కామె పినతల్లియఁట- ఆకుఱ్ఱఁడామె సుతుఁడఁట. వారిపేళ్ళు సుభద్రయు నభిమన్యుఁడు నఁట-

కరి- (ఒకానొకవీక్షణమైన వింతతీరునభినయించుచు) కాఁబట్టియే బాబూ, నన్ను జెత్తఁగొట్టి-

పింగ- (చూపునిగుడించి) ఓరీ ఇఁక నోరుమూయుము అప్పుడుకాదిప్పుడు తెగును మనచెత్త మనరాజును సుభద్రయు నభిమన్యుఁడు నిక్కేవచ్చుచున్నారు- లే, పోదము- (నిష్క్రమించిరి) ఇదివిష్కంభము-

(యథానిర్దిష్టముగా సుభద్రాభిమన్యుఘటోత్కచులు ప్రవేశించుచున్నారు-)

ఘటో- వత్స! నిన్నెంత తూలఁగొట్టితిని నేను గడుఁబాపినైతినిగద-

క॥ తమ్ముఁడ! మృదువగునీదే
హమ్మునునిశితాస్త్రపంక్తి నలయించికదున్
సొమ్మసిలఁజేసినట్టిక
రమ్ములువిందలకు నాకరమ్ములుగావే॥

క॥ అడవులనిటు సిరులకుఁగడు.
నెడమైపడిపోవుచుండ నింకయు సేమం
బడిగిమిము నాదరింపక
వడిఁగొట్టెదునన్నుఁబోలు వాఁడుంగలఁడే।

అభి- అన్నయ్యా! నేనుమాత్రమేమిచేసితిని నీవు పెద్దవుగనుక నెఱుఁగకనైనను నన్ను శిక్షించవచ్చును నేనెఱుఁగకనైనఁ గలనైనఁ బెద్దలఁ దిరస్కరించఁగూడదుగదా! అట్టియెడ మీపట్లనైన నాయవిధేయతను ముమ్మాటికి మన్నింపవలెను- (అని పాదములపైఁబడుచున్నాఁడు-

ఘటో- (అభిమన్యుని లేవఁదీసి శిరము ముద్దాడి) వత్స! కమలాకరము మకరకరందముగాక మఱేమిజిలుకును? (సుభద్రవైపుతిరిగి) అమ్మా! బుద్ధిలేమి మిమ్ములశ్రమపెట్టితిని రక్షించుము- (అని పాదములపైఁబడుచున్నాఁడు)

సుభ- పుత్ర! దుర్వారమగు దైవము చేయించెడు పనులు జేయుచుందుము- నీతప్పేమున్నది- దీనిని మఱచిపోవుము లెమ్ము-

ఘటో- (లేచి) అయ్యో! ఎట్లు మఱవఁగలను?

ఉ॥ తల్లిరో! యిట్టివార్తవిని తాల్మి వినవారినిఁ జూడనెట్టులన్
జెల్లును నేఁడు నేనిటులఁ జేసితినంచెటుదెల్పఁగల్గుదున్
దల్లడమొందిమీరిటుల నావనభూమికి రాఁగరండటం
చల్లననేద దేచిఁ తగినట్టిసపర్యలొనర్పనైతిఁగా॥

సుభ- నాయనా! గతజలసేతుబంధనమునఁ గార్యమేమి?

ఘటో- అమ్మా! నాసౌధమునకుఁబోదమురండు
(అందఱును) నడుచుచున్నారు.

ఘటో- (ముందుకుఁజూచి) ఇదేనాసౌధము నాతల్లిహిడింబియు నాకైవేచియున్నది- లోపలఁబ్రవేశించుఁడు-
[అందఱును బ్రవేశించిరి)

(అప్పుడు హిడింబి సింహాసనస్థితయై యుండ సుభద్రాభిమన్యులతో ఘటోత్కచుడు ప్రవేశించుచున్నాడు.)

హిడింబి- నాయనా! వీరెవరు?

ఘటో- అమ్మా వీరు నీవు అందియుగు నర్జునుని దార పుత్రులు

హిడింబి- (తొందరతో) ఏమీ నాచెల్లెలా ? సుభద్రను గౌగలించుకొని యభిమన్యుని శిరముముద్దాడి ఇవిగోయీయాసనములం గూర్చుండుండు- అందఱును కూరుచున్నారు- )

ఘటో- (సుభద్రతో) తల్లీ !

గీ॥ ఫాలనేత్రుని గెల్చిన పార్థునకును
దారవయ్యును లోకైక వీరుడనగు
నాకుం బినతల్లివయ్యుం గాననము వెంట
నక్కటా నీవు రానేల నమ్మనేండు ॥

సుభద్ర-(తలవంచుకొన్నది)

అభి- (అతికష్టముతో) అన్నా !

మానిని॥ ధర్మసుతాదులు దైవవశంబునం దారడవిన్ వసియింపంగదా
నర్మిలితో బలరాముండునన్ను మదంబునదోడ్కొని పోవనటన్
ధర్మము మీఱక ద్వారకమాతులధామము నందున నుండంగం బ్రి
క్కర్మవశంబునం గాసిలియిట్టులం గాఱవింబడి రాగలిగెన్ ॥

ఘటో- (కోపముతో లేచి) మీకుం బ్రతికూలఫలదమగు నట్టి కారణమేమి?

సుభ- నాయనా! ఏమిచెప్పుదును (సభాష్పగద్గదికముగా)

సీ॥ బలుండాత్మపుత్రినిం దొలుత నాపుత్రునకిచ్చెదనని వచియించియిప్డు
కఠినతవహియించి కౌరవపుత్రునకిచ్చెదనంచు వాక్రుచ్చినాండు॥

ఘటో- (కనుబొమలుముడివేయుచున్నాండు)

సుభ- పోయెంబో గాంధారిపుత్రు నే పల్మాఱు లింతలంతలుగ వర్ణించినాండు.

ఘటో- (పండ్లుపంటపటగీటుచున్నాండు)

సుభ-సీ॥ అక్కటా! మహానీయులగు నీదుతండ్రులం బేరు పేరులం దిట్టి ప్రేలినాండు.

ఘటో- (దేహమునుండి పొగలూదుచున్నాండు.

సుభ- గీ॥ ఏమిచెప్పుదుం బుత్రకా! యిట్టిమాట (కన్నీళ్ళొత్తికొనుచు) కూండుగడ్డలె తేహాయెం గోడలేల? కడుపుంగూట్టికినాయిలు గాచియుండి! యిట్లు ప్రేలినన్వా లికోడ్తునని యో॥

ఘటో- (పట్టరానికోపముతో నొక్కి పెట్టుకనాచిన)

మ॥ అవురా! మేలు! శబాసయారె! బలుఁడాహా! యెంతవాఁడయ్యె నా।
హవఘుర్ధర్షణధనుఃప్రకర్షణకషణాహం కారఘోరస్ఫుర।
న్నవనానావిధచిత్రశస్త్ర రచనాసైపుణ్యమాయారణ।
వ్యవహారజ్ఞుఁడనన్నుసైన మదిలో భావింపకిట్లాడెఁగా!॥

క॥ ఐనం గానిమ్మీయప।
మానము మానంబె మనకు మానము దుఃఖం।
బౌనయహీనుని నిమిషము
లోనవమానించి వత్తు లోకులు మెచ్చన్॥

(అభిమన్యునిఁజూచి)

తమ్ముడా! నీపరాక్రమేమో యత్యధికమని యింతదనుక సంతసించుచుంటినే వ్రేలు గఱచికొని నీరసభావముతో లోకైకవీరుఁడనగు నన్నెడీల్చఁటిచిన నీయస్త్రజాలము నీ ప్రతిశత్రులపై బనకుండుటకు గారణమేమి అయ్యో యెంతచిన్నతనపుఁ బనిచేసితివోయి బలరాముఁడల్లనీయకున్న బోనిమ్ము అతనికేపిల్లలుగలరు మఱియునిమ్ము మహాత్ములగు పాండవులు నట్లుకాఱులు వ్రేలుచుండ నెట్లుసహించితగుదువని యిట్లువచ్చితివోయి? (తలపకించి) కానిమ్ము తొందరేమి (సుభద్రతో) అమ్మా! ఇంకను బెండ్లికాలేదుగద?

సుభ- లేదులేదు తేపేసుముహూర్తము-

ఘటో- ఆఁ అట్లయిన నాచేయుప్రతినవినుఁడు-

చ॥ నిజముగవాయుపుత్రునికి నేనతనూజుఁడనైతినేని! నా
ప్రజనభుజంగయుగ్మసమ బాహుపరిచ్యుతఘోరనారస
వ్రజమునసీరపాణిఁగలబంధులనందఱఁ జిత్రభంగులం
గజబిజిజేసియల్లగజగామిని నాసుముహూర్తవేళక
క్కజముగఁదెచ్చి తమ్మునికిఁ గ్రక్కునబెండ్లియొనర్తుచూడుమీ॥

హరి హర హిరణ్యగర్భుల నైన నవలీలఁ బోదివి చెలంగు సామహిత మాయోపాయంమిల శశిరేఖనిప్పుడతెచ్చువాఁడను (కొంచెమాలోచించి) అమ్మా! ఇంతకును పిల్లదానికోరిక యెట్లున్నదో? ఒకవేళ నాపె మనయభిమన్యునివరించక కౌరవపుత్రునేవరించియున్నచో నాచిన్నదిమనకువలదు- కాఁబట్టి ముఖ్యముగఁ బెండ్లికూఁతు కోరికతెలియవలయును-

(అనియిచ్చుచున్నది)

అభి- (అందిపుచ్చుకొనిసభాష్పగద్గదికముగాఁజదువుచున్నాఁడు)

ద్విపద॥ శ్రీకరగుణజాలసిందూరఫాల
కాకపక్షవిలోలకాంతకపోల
రాజమాన్యరాజరాజాతిపూజ్య
రాజరాజనుపూజ్యరాజసన్మాన్య
తేజోవినిద్రను దేహ సౌభద్ర
ప్రాణనాయకనీకుఁ బ్రణతియొనర్చి
మానినిశ్శశిరేఖమఱియిట్లు వ్రాయుఁ
జెలుతపాయమునుండి చేసినచెలిమి
తలఁగనే నాపయిదయయింతలేక
అయ్యయోయొకకంచమందునగుడిచి
శయ్యపైనొక్కటశయనించలేదె
చెల్లబో! పురుషులచిత్తంబుకన్న
వల్లజాతికినైననర్మిలిగలదు
ఆక్కటా! విరహాబ్ధియడుగులముంచి
యిక్కరణినిబోవనేమిన్యాయంబు
నాతండ్రికూరుఁడైనన్నీయనన్నఁ
బ్రీతియొప్పటికేగఁ బ్రియసఖియందుఁ
జిన్ననాటనెనాదుచిత్తంబుగొల్లఁ
గొన్నాఁడవిప్పుడుక్రొత్తేమివచ్చె
నీకంటెనన్యునినిఖిలేశునైనఁ
జేకొననొల్లనుసిద్ధంబువినుము
వైళంబనీముఖపద్మంబుఁజూప
నాలస్యమయ్యేనచ్యుతుతోడు
శశిరేఖపేరిటశశిరేఖగాని
శశిరేఖయుండదుజగతిలోపలను

దక్కినవన్నియుఁ ద్వరగతినీకుఁ
జక్కగావినుపింతు సవిశేషముగను॥

ఇట్లునీసఖురాలుశశిరేఖ.

(నిట్టూర్పువిడుచుచు) ఆహా! శిరీషపుష్పాధికసౌకుమార్యము గలయామిటారినా కొఱకెంతపరితపించుచున్నదోగదా! నేనెంతకఠినచిత్తుండనైతిని!

గీ॥ ఎపుడుకనులారఁజూతునాయిందువదన
నెపుడుభాషింతుఁగౌఁగిటనెపుడుసేర్తు
నెపుడుప్రేమనుశశిరేఖయిచ్ఛదీర్తు
నౌర! యింకెప్పుడన్నియునవలఁబోయె॥

క॥ రుచిరాకృతినవశశిరే
ఖచకితమృగశాబనయన; గజయాన; వినీ
లచికురశోభితనానే
త్రచకోరములకునువింగుతానెన్నఁడగున్॥

(సవిమర్శముగానుత్తరమునుబరిశీలించి)

చేటీ! ఇందక్కడక్కడనల్లనల్లనిబొట్లుకన్పట్టెడునివియాలేమ యంజనవికీర్ణములైన యశ్రుబిందువులుగాఁబోలు నేమి? ఇచ్చటనాబాష్పబిందువులను మాత్రముజతగూర్పఁగలను (కన్నీళ్లువిడుచుచు)

క॥ సుందరమగునామేడను
ముందరశశిరేఖనిల్పిముదమునదరహ
స్పందమ్మనను జెక్కుల
బొందుగముద్దాడునట్టిభోగముగలదో॥

(తలపంకించి) కానిమ్ము! అన్నియుదైవాధీనములే.

(తెరలో)

త్రిలోకైకవీరుఁడగు నాకీస్వల్పకార్యమెంతలెక్క?
క్షణములోఁబోయి బ్రహ్మకైనఁదెలియకుండ నామాయచేశశిరేఖందెచ్చితి

సుభద్ర, హిడింబి (అప్పుడుప్రవేశించి) ఔర! ఘటోత్కచుఁడప్పుడవచ్చినాఁడు!

ఘటోత్కచుఁడు- మంచముపైనిద్రించుచున్నశశిరేఖతోఁబ్రవేశించి.

ఉ॥ అమ్మరో చూడుమాశుగతినంబరవీథిఁబోయిద్వారకన్

సమ్మదమెప్పఁజేరియలసాధ్వికనామనుజంద్రరేఖనా
తమ్మునికిచ్చి సరూపగతిఁదాల్చినకోమలిఁదెచ్చితింకనీ
కొమ్మను వేగఁజూడుమిదికోడలొ కాకమఱింకనెవ్వరో॥

సుభ- (పరుగుపరుగునఁబోయి మంచముపైనిద్రించుచున్నశశిరేఖమేలిముసుంగుగొంతవాయఁజేసిచూచిచిటికవైచి) ఓ! ఈ పెయేనాకోడలు. ఈ పెనాకోడలే.

ఘటో- ‹‹శుభస్యశీఘ్రం›› మ్మనునటులనీ ముహూర్తమునకే పెండ్లిగాని చ్చెద మఱియుశుభరేఖవ్రాసియుందాద్రిది దేవతలను గూడరావించెదఁ జూడుఁడు (లేఖవ్రాసి) సేవకా! ధనుర్బాణములను దెమ్ము. దీనివంటియువ్యాస్త్రముచే దేవలోకమునకుఁ బుత్తెంచెద.

సేవ- చిత్తము. (ధనుర్బాణములను దెచ్చి యిచ్చుచున్నాఁడు)

ఘటో- (ధనస్సునబాణము సంధించిధ్యానమునునటించుచు)

గీ॥ అస్త్రరాజమ! నీ వేగియాశుగతిని
సకలసురగణములనువాచస్పతియును
రంభ మొదలగునప్సరోరాజితోడు
గాఁగఁదోడ్తెమ్మునుతపలిఖునతఁజూపి॥

(ఫెళ్ళునధనుష్టంకారముజేసి యస్త్రమును లేఖతో విడుచుచున్నాఁడు)

శశి- (ఉలికిపడిలేచితనలో) బాపురే! ఎక్కడిదీధ్వని? (కలియఁజూచి) అశ్చర్య మాశ్చర్యము!

గీ॥ సకలరత్నస్థగితదివ్యసౌధమేడ
మఱియునీఘోరకాంతారమధ్యమేడ
నక్కటా! ప్రియుఁబోనాడియడలుచుండ
కృతినిఘోరముబోలెయీకష్టమేడ?॥

ఏమియీవింతే? (మరలఁజూచి) ఇదేమి? నాప్రాణనాథుఁడు మొదలగువారు నిచ్చట గాన్పించుచున్నారే! నేనుబంపినత్వరగతియునునిచ్చట నేయున్నది. ఏ చింతతోఁబండికొనిననట్టికలవచ్చునంద్రు. కనుక నేనన్ను నాసఖి ‹‹నీవునిద్రించితివేనినీనాథునిఁ గలలోఁజూచెదవు›› వన్నది. కాఁబట్టియిదియెద్ది మేనికలగావచ్చును. (కొంతతడవాలోచించి) అయ్యో! ఇదికలగాదు. నేనుప్రత్యక్షజ్ఞానముతోను

న్నాను. ఇదినిశ్చయమే. అఘటనఘటనా సమర్థుఁడగు భగవంతునివిలాస మి ట్లున్నదిగాఁబోలు! ఔరా! నేనెంతయదృష్టవంతురాలనో! సరే! కానిమ్ము. ఆ కాశవాణియువంధ్యవచస్కురాలుగదా! రక్షకుఁడగు పక్షివాహనుఁడు నాప క్షమునసుండనొక కుక్షింభరుఁడునన్నపేక్షించఁగలఁడా? (అనియత్యంతహర్ష ముతోకన్నులకొకవింతసొగసునీయఁదిగ్గునమంచమునుండి యెగురుచున్నది)

భ- (శశిరేఖచేయిపట్టుకొని) బాలా! భయపడబోకుము కుముదము చంద్రునితోఁగలసినది (లోనికిఁదీసికొనిపోవుచున్నది.)

ద్వార- రాజా! దేవేంద్రుఁడు నారదునితోడను సకల సురగణములతోడను వచ్చి గుమ్మముకడనున్నాఁడు.

కృ- శీఘ్రముగాఁ దోడితెమ్ము.

ద్వార- (నిష్క్రమించి పరల వారితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

కృ- (దిగ్గునలేచి) దేవరాజ! నమస్కారము దేవగురూ! నమస్కారము ఓసర్వలోకవంద్య! నారద! నమస్కారము.

ఘ- (అందఱకునట్లనే నమస్కరించుచున్నాఁడు.)

అందఱును- వత్సలార! శుభమగుఁగాక!

కృ- అయ్యలార! మీరీకనకాసనములఁ గూరుచుండుఁడు.

అందఱును- (యథాస్థానములఁ గూరుచున్నారు.)

కృ- (అభిమన్యునిఁజూపుచు) దేవేశ! ఇతఁడు సవ్యసాచిపుత్రుఁడయిన నీమనుమఁడు ఇతనికి బలరామపుత్రికయగు శశిరేఖను బరిణయము సేయుచున్నాఁడను. కార్యభారముచే నేను స్వయముగావచ్చి దేవరవారి నాహ్వానము సేయలేనయితిని మన్నించవలయును మఱియు నిప్పుడ ముహూర్తమాలోచించి కావలయును కావునఁ బెద్దలు ముహూర్తనిశ్చయము సేయుఁడు ఇంతశీఘ్రముగఁజేయుటకుఁ గారణమేమనఁగా బలరాముఁడీతనికిఁ బిల్లనీయకదుర్యో-

ఇం- హైడింబ! తద్వృత్తాంతము నాకువిదితమైనది నీవువిస్తరించి చెప్పనక్కఱలేదు. బలరాముఁడును గౌరవులునుకూడ బహుగర్వితులై యున్నవారు నీవ్వుయోచించిన యూహ నాకుఁదెలిసినది మంచిపనిఁజేసితివి.

(బృహస్పతి) అయ్యా! ఒప్పు జాముపొద్దెక్కినతరువాత ముహూర్తము చక్క-

గానున్నది.

ఘటో- సరే! మీరిపెండ్లియారంభములను జేయుచుండుఁడు కౌరవ యాదవులు గడుం బ్రమత్తులై యున్నారు వారినించుక పరిభవించివచ్చెదను.

దేవేం- సందేహమేమి?

గీ॥ మామకాదులనందఱమాన్యతములఁ।
బరిభవము చేసి మిక్కిలి ప్రబలియున్న।
తుచ్ఛులను గౌరవాదులనిచ్ఛమీఱ।
నీశరమ్ములఁబొలియించు నేఁడువత్స॥

సర్వథావిజయీభవ! నీవువైళంబపోయిరమ్ము.

ఘటో- (తెరవంకఁజూచి) కరిబలా!

కరిబలుఁడు- (ప్రవేశించి) రాజా! ఏమితమయాజ్ఞ?

ఘటో- మనమిప్పుడు ద్వారకాపట్టణమునకుఁబోయి కౌరవయాదవుల నేడ్పించిరావలెను. కావున చతురమాయోపాయవంతులయిన రాక్షసుల నాయత్తము సేయుము మఱియు వారిని జిత్రవిధులం బరిభవించు టెట్లో యోచించుము.

కరి- మహాప్రసాదము క్షణముయోచించి) ఇదిగో యీయూహతోఁచినది (చెవిలో) ఇట్లిట్లు (అని చెప్పుచున్నాఁడు)

ఘటో- (పక్కుననవ్వి) ఓరిపిడుగా! గట్టియుక్తి పన్నితివిరా! శబాసు! సరే! అప్పుడునేను కవ్వునఱచెదను అదియదనుగానా తుచ్ఛులదిగంబరులఁజేసి నన్నుగలియుడు ఇఁకనీవుబోయి నీప్రయోగమును నడుపుము నేనును బయలుదేఱుచున్నాను.

కరి- చిత్తముస్వామీ! నిష్క్రమించెను.

దేవేం- మ॥ భీమకుమార! నీవలగభీరపరాక్రముఁడై హలాంకుపు।
త్రీమణిఁగోరివచ్చు కురుధీరులయాదవకోటి నేఁచనీ।
తామసమంతఁజూపుదొకో! తత్పురవాసుఁడునీలనీరద।
శ్యామలకోమలాంగుఁడలశౌరిజామీ! చనఁబోకుమద్దెసన్॥

ఘటో- అయ్యో! ఆలోకారాధ్యునే నెఱుంగనే? అమ్మా! నే నేగుచున్నాను.

సుభ- (లోపలనుండి రభసముగావచ్చి) నాయనా!

గీ। అగ్రహంబునఁగౌరవయాదవులకు।

నా యురంతమమాత్రము సేయకయ్య।
కౌరవులఁజంపుప్రతినలుగలవునీదు।
తండ్రులకుయాదవులును బాంధవులునాకు॥

ఘటో- తల్లీ? అలాగున నేచేసివచ్చెదను.

అభి- క॥ అన్నా నీకిదితగునా
నన్నిటువిడనాడిపోవనర్గలితోనీ
వెన్నంటివచ్చివైరుల
నున్నలమొనరింతునన్ను నుంగొనిపొమ్మా॥

గీ॥ తండ్రులరణంబుఁదీర్చఁగఁదటిదొరకెను
శత్రుసంహారమొనరించుసమయమాయె
నిట్టివేళ నెపగతులనేఁచకున్నఁ
దండ్రికడుపునఁబుట్టిసార్థకమిఁకేమి?॥

ఘటో- నీపరాక్రమమట్టిదయయినను ఇట్టిస్వల్పకార్యమునకింతజాల? అదిగాక నీవీవిష
యములోఁ బ్రత్యక్షముగా మామపైఁగత్తిఁగట్టఁజనదు నేఁబోయివచ్చెదను నీవి
చ్చటుండుము. (అందఱితోను) ఆర్యులార! అనుజ్ఞనిండు.

అందఱు- జయజయ.

ఘటో- (నిష్క్రమించెను.)

దేవేం- అయ్యా! ఇఁకమనము వివాహారంభములఁ జేయుచుందుమురండు.

(అందఱునిష్క్రమించిరి.)

ఇది చతుర్థాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## పంచమాంకము.

రంగము, ద్వారకాపురములో నొకవీధి.

—:(అప్పుడు కరిబలుఁడను రాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.):—

కరి— కానిమ్ము! రాజాజ్ఞాప్రకారము రాక్షసులనందఱను రంగులీను బంగారు సరిగవస్త్రములను జేసి పాఁతబట్టలిచ్చిరఁ గ్రొత్తబట్టలిచ్చెదనను మిష వెట్టి కౌరవయాదవస్త్రీపురుషుల వస్త్రములన్నియుఁ జీకిగుడ్డసహిత మపహరించి మాయారాక్షసవస్త్రములంటబెట్టినాను! సమయము వచ్చినప్పుడు రాక్షసులందఱు వస్త్రరూపములను విడిచి వారినందఱను వస్త్రహీనులఁ జేసి స్వస్వరూపములతో నన్నుం గలియుదురు. నాయేలిక ఘటోత్కచుఁడును దనయరణ్యము బయలుదేఱి యీనగరమును బ్రవేశించి భగవంతుఁడగు శ్రీకృష్ణుని మందిరమునకుఁ బైనుండియే వందనములుజేసి సిమ్మటనంతఃపురంబున మాయాశశిరేఖయై ప్రవర్తించియున్నాఁడు మఱియు.

గీ॥ నీరజాక్షికిఁ బెండిలి నేఁడుజరగు
గూర్మిబంధులతోడుతఁ గురువిభుండు
ఘాటిమీఱఁగఁ జమదెంచి దైత్యబాధ
లోరువగలేక విముఖుఁడైయుఱికి చనును॥

(నవ్వుచు) ఇదినాకుత్సాహ సమయము. ఇప్పుడు మాయాశశిరేఖ సఖులకు మిచ్చటించు చిత్రసంభాషణమును వినుటకుఁగాను నేనేగెదను. (నిష్క్రమించెను.)

ఇది ప్రవేశకము.

రంగము శశిరేఖాంతఃపురము.

(అప్పుడిరువురుముత్తైదువులతో మాయాశశిరేఖ ప్రవేశించుచున్నది.)

ప్రథమ-శశిరేఖా ! నీవుమంచి యదృష్టవంతురాలవు సుమీ ! సకలబంధుమిత్రపరిజనయుతుఁడై రాౘాజునను దెంచినాఁడు. పెండ్లిమంటపమలంకరింపఁ బడినది. సకలకౌరవ యాదవాధిపతులును సుఖాసీనులయి యున్నారు. నీభర్తలక్ష్మణుఁడును లెస్సగ నలంకరింపఁబడి యున్నాఁడు ఇఁకనీవు సంతోషముగానుండవలెను. ఆహా ! పెండ్లిపీటపైఁ గూరుచున్న లక్ష్మణునిఁ జూచి నాకన్నులు మిఱుమిట్లుగొన్నవే !

ద్వితీయ- అభిమన్యుఁడభిమన్యుఁ డోయని యెదవెందుకేశశిరేఖా ! ఇదివఱకేమోయనికొని నీవన్న పిల్లను నీతో ననుకరించితిమిగాని యిప్పుడు నీవెట్టిచూడఁగ నాకేతలతిక్కగానున్నది. తుదకీతని యంగరక్షకునికైననుఁ దూఁగునటే యభిమన్యుఁడు ? చూడు !

క॥ జిగిమీఱులక్ష్మణునివిధు
నగుమోమును మాఱుఁగేరు నవరూపంబున్
వగగుల్కు వర్తనంబును
మగువా యీపృథ్విలోన మఱియెటఁగలదే ॥

మాయాశశిరే॥- మీరుపరమమూర్ఖులు మీరట్లు ప్రేలికొనుచుండుఁడు. నేను హాయిగ నిద్రించెదను (పండుకొనుచున్నది)

ప్రథమ- సకియా ! ఎప్పుడును నిద్రయేనా ? లే ! (చేతితోఁజఱచుచున్నది.)

మాయాశశిరేఖ- (ఉంకించిలేచి) అబ్బ ! ఏమే యీయసహ్యపుసంభాషణములు ! (నిట్టూర్పుతో) నన్ను సుఖముగా నిదురఁబోనియ్యరేమే !

వె॥ పెండ్లిపెండ్లియంచుఁ బ్రేలుచుఁగలతురు
కన్నులారనిదురఁ గొన్న నన్నుఁ
బెండ్లియున్నఁ దెల్పు వీక్షించెదను గాక
ముందెలారెపదర కుండలేరే ॥

ప్రథమ- రెండవదానితో (రహస్యముగా), ఓసీ ! ఈశశిరేఖ వరుసచూడఁగ గడుంగడుఁ జోద్యముగానున్నది. ఎప్పుడు నతిమృదూక్తులతో సాలాపించు నీపె యీ

నమునఁ బిచ్చియెత్తినదానిఁ బోలి పరుసాలాపము లాడుచున్నదిగదా !

ద్వితీయ- (రహస్యముగా) అభిమన్యువియోగ దుఃఖానుషక్తంబున నిట్లు పరిభ్రమించు చున్నది సుమీ !

ప్రథమ- శశిరేఖా ! లక్ష్మణుఁడు మగండు గాఁబోవుచుండఁగ నేట్లుండవలెనో !

మాయాశశిరేఖ- (లేచి చిఱునగవుతో) లక్ష్మణుఁడిక క్షణములో నవలక్షణుఁడే యగు నులెండు.

ద్వితీయ- సఖీ ! రారాజింటఁ గాపురము సేయునపుడు నేనువచ్చిన నాకుబంధుమర్యాద లుజేసెదవా ?

మాయాశశిరేఖ- సందేహ మేమి ?

క॥ నా పెండ్లియయినపిమ్మట
పాపము లక్ష్మణుఁడు బ్రతుకు భాగ్యమెకన్నన్
లోపమెనీవటురాఁగా
నీపని మొటలంటఁజేతు నిక్కముసుమ్మా ॥

ప్రథమ- (కోపముతో)

క॥ వాడిగలకౌరవేశ్వరు
కోడలవై యుండలేక కుందెదపకటా
చేడెరో ! యడవులఁదిరుగుచుఁ
గూడైనను లేనిపాథుఁడ కొడుకేఘనుఁడే ॥

(తెరలో)

సుముహూర్తసమయమైనది. త్వరగాఁ బెండ్లికూఁతును రప్పించవలెను

ముత్తైదులువలు- ఇదిగోవచ్చుచున్నాము. (లేచి మాయాశశిరేఖతో నడుచుచున్నారు)

మాయాశశిరేఖ- (నాలుగడుగులునడచి యొకముత్తైదువ మీఁదఁబడినది )

ప్రథమ- (నేలఁబడియున్నగఱచి) తనలో ఎప్పుడు నేడుమల్లెపూవులెత్తుతూఁగు శశిరేఖ యీదినమున నింత భారముగానున్న దేమో? (లేచి కుంటుచునడుచుచున్నది.)

ద్వితీయ-(ముందుచూచి) ఇదిగో పెండ్లి మండపము. ఇది సకలబంధువర్గముతో నిండి యుండుటచే మనము శిరికకుపడకయే దీని ప్రక్కగదిలోనికిఁ బోవలెను.

అందఱును-(లోపలఁ బ్రవేశించిరి.)

## రంగము - పెండ్లిమండపము.

(అందరును యథాస్థానములఁ గూరుచుండియున్నారు. లక్ష్మణుఁడు పెండ్లిపీటపైఁ గూరుచుండియున్నాఁడు.)

బలరాముఁడు- (అటునిటుఁజూచి) సుముహూర్తసమయమాసన్నమగుచున్నను- మనరామభట్లుగారును- సదాశివుఁడుగారును రాలేదు.

రామభట్లు,సదాశివుఁడు- చేత బరిహాస్స మొదలగు పరికరములతోఁ బ్రవేశించుచున్నారు

బల- పురోహితురాల! సమయమైనది. త్వరగా మీయారంభములను జేయుఁడు.

పురో- ఇదిగో క్షణములో నే (నడుములుబిగియించి లక్ష్మణునొద్దఁ గూరుచుండి లక్ష్మణా! ఆచమనముచేయుము.

లక్ష్మ- (అట్లుచేయుచున్నాఁడు)

రామ- (కొంతవివాహకాండజరిపి) ఓరిసదాశివుఁడ!

సదా- ఏమయ్యా!

రామ- ఓరిమూఖుఁడ! ఏమో తెలియదా? త్వరగాఁ బెండ్లికూఁతును దోడ్కొనిరమ్ము.

సదా- ఓ, (అని వెడలుచున్నాఁడు)

బల- (విదూషకునితో) వయస్య! ఇదియే నాకుత్సాహసమయముసుమీ!

గీ॥ సకలబంధులువచ్చిరి సభకుసంత
సమునఁబొందితివియ్యంబుసాటిమీఁఱ
నల్లుఁడారూపజితసుభల్లుఁడరయ
నిదియసాఫల్యమగుదినవిాభవమున ॥

దుర్యోధనుఁడు- రాధేయ! అదిగో కృష్ణుఁడును సాత్యకియు వెల్లనగుమోముతో మనదెసనే చూచుచున్నారు. ఇతని మర్మము నాకుఁదెలిసినది. తాఁబక్షమువహించిన పాండవులకుఁ గార్యముగామినిఁక వారిని విడిచి మనలోఁగలియ నుద్దేశముతోనున్నాఁడు. నేఁబిలిచిన నిప్పుడెగిరిగంతువైచును సుమీ?

కర్ణుఁడు-సందేహమేమి? తుచ్ఛస్నేహములిట్టివే, కోఁతికాఁపురములవంటివి. మీరుమాత్రము పిలువవలదు. చూచినట్లుపేక్షించుటయేపరిభవము

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.

దుర్యో- ఎందుకు పిలిచెదను?

కర్ణ- బలరాముఁడిప్పుడు విశేషించి మనవాఁడైనాఁడు. ఇఁక నీచిలుకనాయనను మూఁడుగడియలలో నవ్వులికీడ్పింతము.

సాత్యకి-(రహస్యముగా) అన్నా! వాసుదేవ! అదిగోచూడుఁడు. తులువలగు కర్ణదుర్యోధనులేమేమో మనలగుఱించి ప్రేలుకొనుచున్నారు. ఈతుచ్ఛుల యల్పఁపుసిరి గుసగుసలువిని నేను సహింపలేనుగద! (కోపావేశముతో లేచి కత్తిదూసి)

పంచచామరము॥ పొరింబొరిందురాత్మసూతపుత్రునిన్ సుయోధనుం
గరేల్కఁ ద్రెళ్లవంగ నాదుఖడ్గధారఁ జెండియున్
బరేతరాట్పురంబుచేర్చి ఫాలనేత్రభూతకుం
గురూత్పుకుండనై రణంబుఁ గొంతఁ జిచ్చి వేసెదన్ ॥

(నప్పించి వారిపైకిఁ బోబోవుచున్నాఁడు.)

కృష్ణు- (చేయిపట్టుకొని రహస్యముగా) వత్స! నీకోపముజూపనిదిసమయముగాదు. అదిగాకనీకుప్రమతేకయే

క॥ వెసనింకగడియలోనీ
గుసగుసలునుగిసగిసలునుగోల్పడిగోచుల్
విసరించివీరలేయే
దెసలకుఁబారెదరొచూడు తేఁకువసెడఁగన్॥

సాత్య- (శాంతించినూరకున్నవాఁడు)

రామభొట్లు- (ఒకనస్త్రీయును లక్ష్మణునికడ్డుగాఁబట్టుచున్నాఁడు)

(తెరలో)

క॥ అక్కా! యీపెండ్లికూఁతురకొమ్మ గాదు
పట్టలేనంతెబరువాయెఁదట్టలోన

రామ- (ప్రక్కకుఁజూచి) జోస్సె! ఓరిజోస్యస్సి!

జోస్యస్సి- (ప్రవేశించి) ఏమినాయనా?

రామ- సదాశివునకుఁ గొంచెము సాయము వెళ్ళు.

జోస్యస్సి- ఇదిగో! యిప్పుడె వెళ్ళితెచ్చెదను. సదాశివుఁడు మోపకభాపనకేనుచుఁడు

(నిష్క్రమించెను.)

(తెరలో)

గీ॥ ఇద్దఱకులొంగకుండెనీయింతిమేను
కాని! చిత్రముదోఁచెడుఁగొల్కిపోల్కి॥
కానిమ్ము- చూతము. ఊఁ వీటితాతలు

జ్యోస్సిసదాశివులు- (మాయాశశిరేఖను దట్టలోనుంచికొని చేతులఁతోఁబట్టుకొని ప్రవేశించుచున్నారు)

జ్యోస్సి- లెక్కా ? ఇందుకేలత్యపెట్టెదనా ? నాబలమునకు ! చూడుము మొక ! (అధోఃకిత్రియంచుఁ బఱ్ఱికిలించి) అబ్బల్లో వెండియు బరువెక్కువగుచున్నదే ! క్రిందఁబడనైవెదవ నానకనాబలాధ్యత్వము చూతము (గట్టిగాఁబట్టుకొని) అఁ ! కొంతబరువు తగ్గినది. సదాశివుఁడ ! భయములేద. తొందరపడకుము. మెల్లగా మెల్లగా.

భయులు- (తట్టదింపినారు)

రామ- (మాయాశశిరేఖను బెండ్లిపీఁటపైఁగూరుచుండబెట్టి) అమ్మా! ఆచమనము సేయుము.

మాయాశశి- (అట్లుచేయుచున్నది)

రామ- (అక్కడఁ గొన్నివివాహకృత్యములఁ దీర్చుచున్నాఁడు)

మాయాశశి- (తెరచాటునుండి పెండ్లికొడుకు కాలివ్రేలుఁ ద్రొక్కుచున్నది)

లక్ష్మ- (ఉలికిపడి పండ్లికిలించి తనలో)

గీ॥ లోకమందెన్నఁ గాంతలనేకలుందు
రెంతమృదుహీనలయ్యుఁబో ! యిఁకోకటిన
పొదలే ! చూడనీకాంతపదముసోకి
బ్రతికితినిమాతృగర్భంపు బలిమికలిమి ॥

అవురా ! ప్రాణములిప్పటికినిఁ గుదుటఁబడవయ్యెను అయిననోర్చికొనవలెనుగదా ప్పుడు నేనేదేనిఁ దొందరపడిన నలుగురు నగియెదరు. నాకేమియోగాని యీపిల్ల కా సోకినప్పటినుండియు విలక్షణమయిన భీతి వొడముచున్నది. పెండ్లియన్న యుత్సా హముపోయినది ఇదేదియో మూఢనయియున్నది. దీనికాయభిమన్యు హాతకుఁడంపలియని వ్యాప్య మోహముచే నన్నెప్పుడో కడతేర్చునట్లున్నది దైవమా !

రామ- (ఉభయులమధ్య తెరఁదీయుచున్నాఁడు)

లక్ష్మ- (లేచి మావిగుండెలు చఱచుకొనుచు)

క॥ అయ్యా యెక్కడిపెండ్లిది

దయ్యంబునుగట్టిపెట్టఁ దగునా మీకీ

వియ్యంబెట్టులఁ జేసిరె

నయ్యో! నాతోడహాస్యమాడుట తగునే? ॥

(తొందరపడుచున్నాఁడు)

దుర్యో- పుత్రకా! ఏమిట్లు భయపడియెదవు? మాకందఱకు దివ్యసుందరిగఁ గన్పట్టుశశిరేఖ నీకు దయ్యమెట్లయినదోయి? నిదురమత్తునను న్నట్లున్నావు. తెలివిఁ దెచ్చికొనుము.

లక్ష్మ- (స్థిమితముగామరలఁజూచి) ఆఁ! ఏమియీచిత్రము! ఇప్పుడు నాకన్నులకుఁ బెద్దదయ్యంబుఁబోలెకన్పట్టి యింతలోనదివ్యసుందరిగమాఱినది! అహా! ఇప్పుడు చూడ నాకన్నులమిఱుమిట్లు గొనఁజేయుచున్నదీకన్నెచెన్ను! (అప్పుడద్రుల్లిపడి) నాయనలార! (గద్గదస్వరముతో)

చ॥ సరగునఁ బెండ్లి సేతుమనిసంతసమారఁగఁదెచ్చినన్నుభీ

కరమగుమీసముల్గలిగి గ్రక్కునఁబండ్లికిలించుకోతిఁకి

పరునిగఁజేయఁబూనితిరె? వాహ్వారె! దండముమీకుఁబెండ్లికి

ధరణిసజీవుఁడైననుగదాగృహదారసుతప్రయత్నముల్ ॥

దుర్యో-సభికులార! ఏమియీవింత? వెఱ్ఱియెత్తినవాడుంబోలె రోదనముసేయుచున్నాఁడు (తనలో) ఒకవేళ నీచెలువచెలువముఁజూచి మోహావేశముచేఁబరవశత నొందుచున్నాఁడేమో? (లక్ష్మణునితో) కొడుకా! నీవేయింతచేతఁగానిపని సేయుచుంటివేమి? ఇటులుండినసభవారునగరే? ఇదిగోచూడుము! నీభార్యనిన్నుఁజూచియెట్లు నవ్వుచున్నదో! తిన్నఁగాఁగూరుచుండుము.

లక్ష్మ- (మఱియుఁజూచితనలో) బలె! వెండియుసుందరాంగియయినది! సరే! ఇదివఱకైననాభయమటుండనిమ్ము నేనపారఁబడుచుంటిని. ఔరా! మాటిమాటికిఁజూడఁగోరికపుట్టించుచున్నవీచెలియచూడ్కులు! (అంతలోనదిరిపడి) అయ్యయ్యో! ఏమిది? ఆఁ! ఉండుముండుము (పెద్దగొంతుతో) బాబో! నన్ను సింహముపాతవేసెదరా? నేఁబ్రదుకమీకిష్టములేదేనినన్నొక్కసారిగఁజంపరాదే? ఇంతహింసయేల

దుర్యో- పెద్దలార! ఇతఁడెచ్చటనైన జడిసికొనియుండవచ్చును. మఱియుదృష్టిదోషము గూడతగిలియుండవచ్చును. కావునవేగమరక్షఁగట్టుండు.

రామ- నేనురక్షకట్టుఁగట్టగలను నాకువేయిగదానికిదక్షిణరావలెను. (తనలో) నాకే మోహనాశనమంత్రములు తెలియునని మోసపుచ్చి, యెందఱికురక్షలుగట్టి డబ్బుగుంజుకొనుచున్నాను!;

దుర్యో- (అప్పుడొకబంగారు నాణెమిచ్చుచున్నాఁడు)

రామ- (లక్ష్మణునిబుజమున మంత్రపూతముగురక్షఁగట్టి) లక్ష్మణా! ఇఁకభయములేదు స్తిమితపడుము.

లక్ష్మ- (స్తిమితముగాఁ గూరుచుండియుట్టిపలయెత్తి తుళ్ళిపడి)

సుగంధి! కొండమచ్చు కొండమచ్చు గుట్టుగుట్టుమంచుబల్
కొండరీతివిక్రమించికొట్టవచ్చుచుండెహా
పిండియింతబొక్కుచుండిపెద్దపెద్దగోళ్ళచేఁ
గండలన్నిలాగుచుండెఁగర్మమిట్టులయ్యెఁగా॥

(ఏడ్చుచున్నాఁడు)

అందఱును- (సంభ్రమించికలకలశబ్దములతోఁగొణుగుకొనుచున్నారు)

లక్ష్మ- (లేచినంతధైర్యముతోఁజూచితనలో) ఆహా! వింత వింతరుచులనీనుచున్నదీ చెలియమోముఁదమ్మి! ఒకసారిదీనినాలింగనము జేసికొనినా దేహమును బవిత్రము జేసెదను. ఆవలనేమయినను గానిమ్ము (లేచిదొంవరతో) హాశశిరేఖా! శశిరేఖ!

(అనికౌఁగలించుకొనఁబోవుచున్నాఁడు)

దుర్యో- (సరభసముగాలేచి చెయ్యిపట్టుకొని) కుమార! అబ్బ! ఏమియీకర్మము! నాకింతటియవమానమునుదెచ్చిపెట్టుచుంటివోయి!

గీ॥ రాజరాజనుబిరుదచేరమణకెక్కి
యఖిలజగమేలునాకపత్యంబవయ్య
నక్కటా; బేలవై యిటులాచరింపఁ
జెల్లునేయెల్ల బంధులుఛీయనంగ?

లక్ష్మ- ఉండుముండుము. నీఛీలునుగీలును తప్పు చూతము. (చేయివిడిపించుకొని) శభాస్ అగుఁగాక! ఆతురముతోఁగౌఁగలించుకొనఁబోయి) ఇస్సీ!

అ, వె॥ జడలపయ్యామగుచు సాగిహుమ్మనుచును
మీఁదకుఁజికి నెత్తి మీఁద మోది
పెదవులదరునట్లు పెద్ద కేకలు వెట్టి
జీవనంబునీయ సిద్ధమాయె॥

ఇఁక లేదాశ (దోసిలియొగ్గి విన్న బోయినముఖముతో)

క॥ భూతమ ! కొట్టనుకొట్టకు
నేతినిలద్దూలుపంచినీకర్పింతుక్
మాతనొకసారి చూడఁగ
నీతతిఁబోనిమ్ము వెనుకనింకెట్టులయినన్॥

(అనిలేచిఁపోఁబోఁగాఁగొందఱుపట్టికూలవైచి) నారు)

దుర్యో- రాధేయ ! నీవుగడుఁజాఱుపుఁబుద్ధి గలాఁడవు ఈమాయయేమో యోచింప వుగదా !

క॥ తేఁపకుఁదేఁపకు లక్ష్మణఁ
డీపగిదిని వెట్టియెత్తియేడ్చెడునిదియే
పాపము ! తెలియదు యీచెలి
రూపమువీక్షింపనిండు రుచిగలదయ్యన్ ॥

కర్ణ- (లేచిలక్ష్మణుని కన్నులు నీటితోఁగడిగి) ఈసారి సావధానముగాఁ జూడుము నాయనా ! (అని పెండ్లికొడుకు మోము బలవంతముగా పెండ్లికూఁతు వైపుత్రిప్పుచున్నాఁడు)

లక్ష్మ- (గట్టిగాఁజేతులు రెండును గన్నులపైనొక్కికొని బిగబట్టుకొని యంపువవలెఁగూరుచున్నాఁడు)

కర్ణ- (కోపహాసములతో) ఓయి లక్ష్మణ ! ఏమినీయవలక్షణములు.

మ॥ ప్రమదారత్నముచంద్రరేఖయిటులంబొల్పింపఁగాదానినీ
వమరంజేకొనకిట్లుమూర్ఖమతివై హాస్యాస్పదంబౌనటు
ల్విముఖత్వంబునఁగొంటిముచ్చనియెడౌ వెఱ్ఱెత్తెఁబో! కాకయా
కమలాక్షింతవరించిరాఁగఁదనమోక్షాలోఁడువాఁడుండునే॥

గీ॥ మందభాగ్యుఁడనీకట్టిముగువనొరకఁ

బ్రాప్తమున్నదెపోయెఁబోపాపకర్మ
తగుదుమనమేమునీతోడఁ దఱలిరాఁగ
మాకుఁగూడను సిగ్గయ్యెమాటలేల॥

దుర్యో- (లక్ష్మణునిగడ్డముపట్టుకొని యనునయభావముతో) నాయనా ఇంకనొక్కసారి మాత్రము స్తిమితముగాఁ జూచివిడువుము. ఇఁక జూడవద్దులే. (బలవంతముగాఁ గన్నులువిప్పి ముఖము చిన్నదానివంకఁ ద్రిప్పుచున్నాఁడు).

లక్ష్మ- (ఎట్టకేలకు మెండిధైర్యము తెచ్చిపెట్టుకొని చూచి యెగిరి వెల్లికిలఁబడి కనురెప్పల్లార్చుచుఁ జేతులుజోడించి)

సీ॥ ఎప్పుడుమీకేమి యెగ్గొనర్చితినయ్య యీరీతినన్నలయించుటకును
పుట్టినదాదిగా గట్టిగామాటైన నేరుపనాచేయు నేరమేమి
అయ్యయోయిదియేటి తొయ్యలి మీరేఁ గనులజూడరునీని గంద్రతనము
కటయఁగమదరంగఁ గనులెఱ్ఱజేయుచు హుంకారమున మీదికుఱికిచీల్చె

గీ॥ దేహమంతయురక్తప్రవాహమయ్యె
ప్రాణములుకంఠగతమయ్యె బాబులార
(నలుదెసలఁ జూచుచు దీనస్వరముతో)
తల్లిరోయిట్లు నేను వెతల్పడంగ
గర్భపుంబిసినీకైనఁ గరుణరాదె॥

(తనలో) అహా! ఎంతగతి సంభవించినది దైవమా! చిన్ననాటనుండియు నన్నతి ప్రేమతోఁ బెంచువీరందఱు నాకిట్టిప్రాణహంతకులయ్యెద రనుకొనలేదుగదా. హా! దుర్వార దైవదుర్విలాసము! ఇదికలయా? లేక యేదయిన మర్మమా కాదుకాదు ఇదంతయు నాపురాకృత కర్మము. ఎచ్చటికైనఁ బాఱిపోవుదమన్నను కఠినాత్ములగు వీరందఱు నొక్కుమ్మడి నన్నుఁ బట్టి కూలవేయుచున్నారు బ్రహ్మపెట్టిన యీయువయింతటితో సరికాఁబోలు నెవరితరము? ఇఁకఁజావు నిక్కంబు కానిమ్ము ఇప్పుడునీనరక్షకుఁడగు భగవంతునిధ్యానించుచుఁ బ్రాణముల విడువనగును ఇదియుహాపరసాధకముగదా.

(ఆపత్సమయమునందైన నిరాళబ్రహ్మానుసంధానముతో)

ఉ॥ ఓకరుణాకటాక్ష సుగుణోదధి! యోశరణాగతరక్ష! యో

దేహమునవస్త్రములా లేవు తేళ్ళను జెఱ్ఱులను దొడలనఱకెక్కి కుట్టుచున్నవి వస్త్రములకుఁ బోయినవారిసెవ్వరో తోఁపనలోనకడతేచిరఁట మాకర్మమిటులయ్యెనది.

—(*)అంతరిక్షమున.(*)—

గీ॥ ఓరికురుకులపాంసన! యోరిమూర్ఖ
పాచికలఁ గావురాజ్యంబుదోఁచికొనఁగ
నొక్కనిముసమునీవిట నుంటివేని
నాత్మజునకేమిగానినీకగును పెండ్లి॥

(తెరలో)

„రామ రామ! ప్రళయకాలము నాఁడు వోలెఁ గాఱుచీకటులుగ్రమ్మ ఘోరాకారమగు పవనగహ్వరములు దెఱచికొని యనేకదుష్టమృగములుత్పన్నములై బాధించుచుఁ బైనుండి ఱాళ్ళను బెంకులును బడుచున్నవిగదా! ఏమిబుద్ధి?„

అందఱును— తొందరపడకుఁడు మేమువచ్చుచున్నాము.

దుర్యో— ఏంతసిగ్గుపాటు! మనమిట్లూరకుండిన నిలువలేము [ఓహో కౌరవయోధులార ? కర్ణా ధనుర్ధారులమై యీపాపాత్ములఖండింతమురండు.

(అందఱుధనుర్ధారులై నిష్క్రమించిరి)

ఇదిపంచమాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## షష్ఠాంకము.

రంగము ద్వారకాపురపునీరాటపురేవు.

(ఇద్దఱుపురస్త్రీలు బిందెలుబుజములపైఁబెట్టుకొని ప్రవేశించుచున్నారు)

ప్రథమ- (చెవియొగ్గివిని) ఓసీ! పెండ్లివారింటనేదో పెద్దరొదగానున్న దేమే!

ద్వితీయ- నీవెఱుఁగనేయెరుగవా? ఇదివఱకుజరిగిన దెంతచిత్రమో!!

ప్రథమ- నేనుమాబంధుగులింటఁ బెండ్లికివెళ్ళియిప్పుడువచ్చినాను. శశిరేఖకుఁబెండిలి యగుననిమాత్రమువిన్నా (అధోదృష్టియందప్పుడు పెద్దపులులబారొకటి యట్టులబెదబెదపరుగెత్తిపోఁగాఁజూచి భయభ్రాంతచిత్తయైసొమ్మసిల్లి. అయ్యో! ఇదేమి? ఎప్పుడు నెఱుఁగనియీదుష్టమృగములు?

ద్వితీయ- ఇదే శశిరేఖపెండ్లి.

ప్రథ- మూర్ఖురాల! నాతోనీకుహాస్యముఁ జే?

ద్వితీ- కాదే. నిశ్చయమే.

ప్రథ- పెండ్లివారివికూడఁదెచ్చినారాయేమి ?

ద్వితీ- (ఎంతోవిచారముగలగద్గదస్వరముతో) అవునమ్మా. వీంద్రమూలమున నేయివి వచ్చినవి. ఈయవలక్షణపుఁబెండ్లివారెచ్చట దాఁపరించిరోకాని మావాంద్రక్రొత్తయల్లుఁడు మనుగుడుపునకు వచ్చివీథిలోనిలచుండఁగా పెద్దపెద్దరాళ్ళవర్షము లెసరిసనలిగిపోయినాడు (పైఁటకొంగుతోఁగన్నీళ్లు దుడిచికొనుచున్నది)

(అప్పుడుమఱి యొకసుందరిప్రవేశించుచున్నది)

తృతీ- అమ్మలార! మీరు చెప్పుకొనునవిశశిరేఖపెండ్లిమాటలేగద!

ద్వితీ- అవునమ్మా.

తృతీ- అయ్యో! అక్కా! నిన్నమావారును బెద్దతాయినెత్తిమీఁదబడి చచ్చువారేసుమీ! ఇంకను నాసూత్రపుబలిమిగట్టిగానున్నది గనుక నంగుళమాత్రముదాటినది. కాని, మాయావుమాత్రము ఎచ్చటను గానరాకున్నది. ఏదోపులివేసికొనిపోయినది కాఁబోలును (కన్నీరురాల్చుచు) అయ్యో! కుంచెఁడుపాలిచ్చుచున్నదమ్మా? నీళ్లతోడుకొనిపోవుచున్నది

ద్వితీ- పాపము! శశిరేఖయేమయినదో తెలియుట లేదఁట.

ప్రథమ- సఖీ! శశిరేఖ కనఁబడ లేదనఁగా నాకుమిన్ను మీఁదబడినట్లున్నది. నాకు మంచి స్నేహితురాలుసుమా. ఈమాటవినినప్పటినుండియు నాకేమిఁయుదోఁచుట లేదు కాఁబట్టి యొక్కసారిమనము పెండ్లివారింటికిఁబోయిచూచివత్తమా?

ద్వితీ- సరిసరి! అచ్చటికిమనముపోయిమరలఁబ్రాణములతోరాఁగలమా?

ప్రథమ-అట్లుకాదు నేనుగూడనున్నానుగనుకనవిమనజోలికిరావు నేనుగృష్ణునిపరిచారికనని యెఱుగుదువుగదా. మీదుమిక్కిలిశశిరేఖప్రాణస్నేహితురాలను, కానా? ఈ సంగతియేమిజరుగుచున్నదో చూచిరమ్మని రుక్మిణినన్నంపినది. ఒక్కసారిచూచివత్తమురా?

ఇద్దఱును-బిందెలక్కడదింపినడిచిపెండ్లివారిల్లుసమీపించివారు

(తెరలో) పెద్దకలకలము.

ద్వితీయ. ఔర! కౌరవయాదవులెంతలేసికష్టములుబొందుచున్నారు! అమ్మయ్యో! నేనురాను- ఆలోపలికిమనముపోవుట. యమద్వారముసొచ్చుటలాగున్నది.

ప్రథ- ఓసిభీరురాల! భయములేదురమ్మ (ముందుచూచి) ఓహోహో! బలరాముఁడిట్లనేవచ్చుచున్నాఁడుఆయనముఖమెంతదైన్యమును సూచించుచున్నదో మనమీయనకుఁగానఁబడకులపలోపలఁబ్రవేశింతమురమ్మ. (ఉభయులునుత్వరతోనిష్క్రమించిరి) (ఇదివిష్కంభము)

(అప్పుడునిరుత్సాహుఁడై విన్నఁబోయినముఖముతో బలరాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

బల- (ఆకాశమువైపుతలయెత్తి) దైవమా! ఎంతకష్టముదెచ్చిపెట్టితివి! ఈవిపత్సముద్రము నెట్లుదాటుదును? (తలపంకించి) ఈమాయయంతయుఁ గృష్ణునిఁ దెలియకమానదు. ఈవిషయములోఁ దాను తటస్థుఁడైయున్నాఁడు. (ప్రక్క-

కుఁజూచి) సేవకా! కృష్ణునిని సాత్యకిని నేను రమ్మంటినని చెప్పుము.

సేవ- చిత్తము. (నిష్క్రమించెను.)

(అప్పుడు సేవకునివెంటఁ గృష్ణుఁడును సాత్యకియుఁ బ్రవేశించుచున్నారు)

బల- (ఆతురముతోఁ గృష్ణునిఁ గౌఁగలించుకొని) తమ్ముఁడా?

మ॥ అకటా! యేమనిదూరువాఁడనిను గృష్ణా యిట్లు నేనొంటిమై
బ్రకటారాతికృతప్రతారణభయభ్రాంతుండనై యుండనిం
తకతోరత్వముబూనఁ దిన్న నవనీతంబంత నేమయ్యె! రెం
తకు రాకుంటివి కేమి చెప్పుదును నానాదిక్కులంజూడఁ గా
నొకచో దుష్టులు కొండముచ్చులెలుగుల్ వ్యాఘ్రంబులై నిల్వనీ
యొకచెంపల్ పగలంగఁ గొట్ట నొకచో వ్యాళంబులా కుక్కమ్మడిం
బ్రకరాళోర్భటులుప్పతిల్లఁ దమజిహ్వల్ సాచిబాధింపవే
ఱొకచో జెఱ్ఱులువృశ్చికంబులును దాముత్సంగదేశంబులె
క్కికుతారంబులఁ జీల్చినట్లు తమకోర్కుల్ దీఱఁగుట్టంగనిం
కొకచో వ్యాఘ్రమృగేంద్రసంఘములు భూద్యోలోకముల్ తేఁపతే
పకుఘూర్ణిల్లఁగఁ గాండ్రుకాండ్రుమని బొబ్బల్వెట్టనిట్టట్టుదోఁ
చకవీథింబడనంతకంటెఁ దఱచైచటాభ్రిళ్ళునన్మాత్రమాం
సకబంధాస్థికశుక్లశోణి తమలాసారంబులాకాశమూ
డికులోకంబునఁ గూలినట్లుగురియన్ డీల్పోయియిట్లుంటిమో
వికచాంభోరుహనేత్ర వీఁడెవఁడో యీవృత్తాంత మేమో వెసన్
సకలంబున్వినిపించిపోవఁగదవే సంకోచమింకేటికిన్॥

కృష్ణు- (ఏమియుఁ దెలియనివానిబోలె నూరకున్నవాఁడు)

బల- ఓయీ! క॥ ఇత్తఱి మేమిటు వెతలం
దత్తఱపడుచుండ నట్టితప్పించుకకిం
చిత్తైనఁ జింత సేయవు
మెత్తురె లోకులిది విన్న మేదినిఁ గృష్ణా॥

కృష్ణు- (కొంతకోపమును గొంతచిఱునగవును మొగంబునకు వన్నెపెట్టఁ గొఱకొఱఁజూచుచు)

ఉ॥ లోకులు మెచ్చరంచునను లోపము లెంచుట కేమిలోటు జ్యో
త్స్నాకరతుల్యసత్త్రిసహజాప్రియపుత్రుఁబ్రదానపాత్రినా,
నాకపపౌత్రసద్గుణగణప్రతిభాసుచరిత్రుఁబాధఁజుం
బోకడపెట్టితు ఘనసుఁ బుత్రికనీయఁగనుద్యమింప నే
లోకులునిన్ను మెచ్చిరో కో లోకులువారలెనన్ను మెచ్చఁగన్

బల- (తలపంకించి) క్షతము పైక్షారము బెట్టినట్లు నాయిప్పటియవస్థకు మఱింత వేదనము గలుగఁ జేయుటకు నిన్ను బిలువనంపలేదోయి నీకేమైన నీవిషయములో దెలిసి యుండిన వినిపింపుము కాని నాఁడు మఱియు సంతోషము.

కృష్ణు- సరే! నాకుఁ దెలిసినంత నేను జెప్పవాఁడ వినుము. నీవాడినకఠినోక్తులనుఁ గనలి యభిమన్యుఁడర్ధరాత్రివేళఁ దనతల్లి నిదోడ్కొని తనపిత్రుజనముకడకుఁబోవుటకై మహారణ్యములఁ బడిపోవుచుఁ గాలవశముచే భీమపుత్రుఁడగు ఘటోత్కచు నియాశ్రమముఁ జేరినాఁడు అచ్చటవారిరువురకును ఘోరయుద్ధమయినది- అప్పుడు వేదవ్యాసుఁడు ప్రత్యక్షమైవారిద్దఱకుఁగల బంధుత్వమును శ్రుతపఱచిపోయి నాఁడు.

బల- (తనలో) అయ్యో! ఈసన్యాసి వ్యాసుఁడేల దాఁపరించినాఁడో! వీఁడు రాకుండినఁ గడుజక్కగానుండి పోవునుగదా! పిట్టతగవు పిల్లి దీర్చిన నట్లుగానయియుం డును సరే విధియిట్లున్నది- (పైకి) తరువాత-

కృష్ణు- అటుపై నివారిద్దఱును సఖ్యపడి నంతట ఘటోత్కచుఁడు వారినరణ్యాగమనకారణమడుగ నభిమన్యుఁడీసంగతి యంతయుఁ జెప్పినాఁడు- అప్పుడు వాఁడు దుర్భరమగు క్రోధావేశంబున నాక్షణంబ యంబరవీధినివచ్చి తనమాయచే శశిరేఖ నెత్తుక పోయి యచ్చటడించి వెండియుఁ దావచ్చి మాయాశశిరేఖయై ప్రవర్తించి యుండి పెండ్లికొడుకు నిన్నిపాట్లుపెట్టి తుదకిప్పటికిని విడువకున్నాఁడు- అదిగావున నను-

గీ॥ ఎఱిఁగిచేఁజేతఁ జేసినయిట్టిపనులు
తగుఫలంబులఁ గుడుపక తప్పిపోనె?
చెల్లెలిని గాఱులాడి నిశీథమునను
వనములకుఁ దోలనింతేసి పనులుపుట్టె॥

బల- నేను శశిరేఖనీయనంటినిగాని యర్ధరాత్రివేళ నడవులకుఁ బొమ్మనలేదుగా- కృష్ణా

పాండవులకుఁ దెలియకమానదు. అనంతరము,

క॥ సూనాస్త్రుఁడైనపార్థునిం
డీనినపులివోలెవచ్చి యెంతయుమనలం
బ్రాణంబులతోనింటికి
రానిచ్చెనెనీకువట్టె భ్రమలింకేలా ॥

(అదియునుంగాక)

సీ॥ పందికైపోరిఫాలాక్షునోడించిపాశుపతముగొన్నబల్లిదుఁడు
ఆఖాండవంబేర్చియగ్నిహోత్రుబుభుక్షుసంతృప్తిజేసినశస్త్రవిదుఁడు
కాలకేయనివాతకవచులఘనపరాక్రములనిర్జించినఘనబలుండు
శరణాగతత్రాణనిరతుఁడాఖండలనందనుఁడశేషలోకసుందరుండు
నామదశకంబుచేకొన్నశ్రీమహితుఁడు
శత్రుజలధరసంఘఝంఝూసమీరుఁ
డార్తరక్షణపరుఁడచ్ఛకీర్తిధరుఁడు
పార్థుఁబోలంగఁగలరెయీవసుధనొరులు॥

అట్టిమహాభాగుండగు పార్థునివిడనాడి తుచ్ఛుఁడగు దుర్యోధనుఁ జేకొనుట మత్తేభకుంభతట ఘనమాంసలంపటంబగు మృగేంద్రమును గేలిసేసి తెగులుఁగొంటికుక్కనుచేకొన్నట్లయినది కదె?

బల- (తనలో) అయ్యో! నేను వెనుకనతనియెదుటఁ గౌరవులనెంతయు స్తుతించి పాండవులదూఱినాఁడను. దానికిప్పుడునన్నితండు దెప్పిపొడుచు చున్నాఁడు. ఏమి సేయుదును. కోపమునకిప్పుడు సమయముగాదు. సామమునఁ గార్యసాధనముగదా కనుక నేనిప్పుడిట్లుల నటించెదను. (పైకి) అవును! కృష్ణా! గతజలసేతుబంధనము నఁగార్యమేమి? తప్పక నాకూఁతును సౌభద్రునకిచ్చెదను. కావుననీయిష్టము వచ్చినట్లుచేసి యీయిడుములఁబాపుము.

(కొంచెమాలోచించి) సరే! ఈవాక్యమువంధ్యమగుఁగాక

(ఆకాశముజూచుచు)

గీ॥ ఓయిశ్లాఘింపమెచ్చితినీయసాధ్య
బాహుబలమునకెంతయుఁ బార్థజనకుఁ

గూఁతునిచ్చెదుమాయన్నకూర్మిమీఱ
చలముసాధించినావిఁకఁజాలురమ్ము॥

(అంతరిక్షమున)

మత్తకోకిల॥ దీనలోకశరణ్యకేశవదేవదేవదయానిధే
శ్రీనివాసజనార్దనాహ్వయశిక్షితాసురమండలా
కానివాఁడనెనన్నుఁబిల్వకకామపాలుఁడుమానముం
బూనియుండఁగనెట్లురామదిబుద్ధిపుట్టునుమాధవా?॥

కృష్ణు- (బలరామునివైపుచూచుచున్నాఁడు)

బల- (తలపైకెత్తి)

గీ॥ ఓయిహైడింబమెచ్చితినీయసాధ్య
బాహుబలమునకెంతయుఁబాధఁజెందకుఁ
గూతునిచ్చెదనిఁకనీదుకోపమణఁచి
చలముసాధింపఁబడెనిఁకఁజాలురమ్ము।

క॥ పురజనులుబంధుజనులును
గరమునసంజెప్పరానికాఱులనిందిం
చిరివచ్చినబందుగులను
మరియాదగనింతతోసమరలగనిమ్మీ॥

(అంతరిక్షమున)

మామా! నీవాక్యములు నాహృదయంగమములైనవి. కాని, నాతోడనీకు సఖ్యము గావలయు నేనియిప్పుడ యీగౌరవవంతులగు కౌరవోత్తములనూరు వెడలఁగొట్టింపుము.

బల- (అటునిటుచూచుచున్నాఁడు)

సాత్యకి- (రభసముతోలేచి) ఆపనినాది. అన్నా! నన్నుఁబంపుము. (నిష్క్రమించెను)

(తెరలో) ద్విపద॥ ఓరిదుర్యోధనయోరిసౌబలుఁడ
యోరిదుశ్శాసనయోరిబాహ్లీక
యోరిజయద్రథయోరిరాధేయ
యోరిద్రోణతనూజయోవృషసేన

పూర్వము నా సినిస్వంతంబువోలె
గర్వమంతయుఁ బాసి గాసిలియిట్లు
మాయూరి పంచల భ్రష్టంగ నేల
నాయమ్మ మీకు లెస్స న్యోఁ బోషాండవు
జీవించి మీ కింద్రఁ జేరుటే మీకు
వేవేలు శశిరేఖ పెండ్లి యేమాయె
తాఁ జెడ్డకోఁతి కాంతారము చెర్చె
నోఁజపక్కఁ గర్వంప నుపరించు మట్లు
మీరు నేరక నోట మేలెంగలుగు
దారుణ నిర్ధూమ ధామమైపోరె
కరుణించి మా వాఁడు కడొలిమునియెఁ
బరువెత్తుఁడి దసందు హాసాత్ములార॥

బల- (తనలో) ఆయ్యో! సాత్యకి తనకోపమునంతయుఁ దీర్చుకొను చున్నాఁడుగదా.

సాత్యకి- (ఉత్సాహముతో మరలఁ బ్రవేశించి) అన్నా! మన వారప్పుడే హస్తినాపురికి నిది రిగి చూతురుసుమా! పాపము! ఈపూట తిండియైన లేదు.

ఘటోత్కచుఁడు- (నిజరూపముతోఁ బ్రవేశించి) మామలార! వందనము. (రామకృష్ణుల కుసాష్టాంగము పడినాఁడు)

బల- నాయనా! నీవే నాయింతవిద్య చేసితివి? చాలసంతోషించితిని.

కృష్ణు- వత్స! పెద్దలయెడ నింతయనాజ్ఞాపము కూడునటోయి!

ఘటో- మామా! మేనమామబిడ్డయందల్లునకుఁగల స్వాతంత్ర్యమునకు మించు తప్పు నేఁజేయలేను. నన్ను మన్నింపవలెను.

బల- భీమపుత్ర! సరే! త్వరగా శశిరేఖాభిమన్యులను బిలిపించి నాకూఁతును నాకంటఁజూపుము నాయనా!

ఘటో- మీరు నాయాశ్రమమెప్పుడు చూతురు? మీరందఱు దయచేసి సుభద్ర నొప్పించి యందఱను వెంటఁగొని రావలయునని నాకోరిక.

కృష్ణు- అన్నా! అట్లే చేయుదము.

బల- సరే! మీయిష్టము మీరెట్లు చెప్పిన నట్లే

(అందఱు నిష్క్రమింతురి)

ఇది షష్ఠాంకము.

శ్రీ

# బలజా సౌభద్రీయము.



## సప్తమాంకము.

రంగము ఘటోత్కచాశ్రమము.

—*వనమలంకరించుచు సిద్ధులు పరిచారకులు ప్రవేశించుచున్నారు.*—

ప్రధ- కరిబలా ! ఏమింత తొందరతోడి యుత్సాహముతో వనమలంకరించుచుంటివి.

కరి- సఖా ! దీర్ఘదంష్ట్రా ! ద్వారకాపురమునుండి మహాఘటోత్కచుడును శ్రీకృష్ణుడును బలరాముడును లోనగువారు మనవనమునకీదినమున వచ్చెదరు. మనప్రభువుగారు ముందునన్నేగి వనమలంకరింపుమని చెప్పినందున వచ్చి చేయుచుంటిని యారంభము.

దీఘు- ఇప్పుడు వారందఱును వచ్చి యేమి చేసెదరు ?

కరి- సుభద్రాభిమన్యులను శశిరేఖను ద్వారకకు దోడ్కొనిపోయి యచ్చట శశిరేఖాభిమన్యులకు బరిణయము చేసెదరట.

దీఘు- అయ్యో ! చెడితిని ! చెడితిని !! ఇక్కడ వివాహమగుననియు గడుపునిండ నిచ్చటీఊ మెక్కవచ్చుననియు వేచియున్న నాకీయపకారము చేసినవారెవరో వాండ్రకడుపు!

కరి- ఛీ ! నిర్భాగ్యుడ ! నోరుమూసికొనుము. మనరాజుగారితో ద్వారకకు మనము మాత్రము వెళ్ళుచున్నామురా !

దీఘు- (పట్టరాని సంతోషముతో) నాయనా ! నీకడుపుచల్లగా నన్ను బ్రతికించినావోయి ! (కౌగలించుకొనుచున్నాడు)

(తెరలో)

ఎవరక్కడ ? ఇంద్రాదులు వచ్చుచున్నారు. పొండు.

(ఉభయులునిష్క్రమించిరి.)

ఇదివిష్కంభము.

(అప్పుడింద్రాదులు ప్రవేశించుచున్నారు)

ఇంద్రు- నారదగురువర్య ! మనమువచ్చి కడుఁదడవాయె. ఘటోత్కచుఁడు మనలఁగా! ర్యారంభము నేయుచుండుఁడని తాఁజని యింకయు రాలేదు.

నారదు-(ప్రక్కకుచూచి) అదిగో ! మాటలోనే వచ్చుచున్నాఁడు తానొక్కరుఁడేకా క బలరామాదులను గూడ లాగికొని వచ్చుచున్నాఁడు ! బలరామునికిఁ దిక్క తోఁచినది కాఁబోలును !

(బలరామ, శ్రీకృష్ణ, ఘటోత్కచులును మఱికొందఱును బ్రవేశించుచున్నారు.)

దేవేం. అయ్యా ! మీరందఱు యాసనములఁదయ సేయుఁడు.

అందఱు- (కూరుచున్నారు)

కృష్ణు- దేవరాజ ! ఈతీర్థమున నిన్నుఁజూడఁ గల్గితినిగదా !

దేవేం- దేవాదిదేవ ! మీరు సర్వదా మమ్ములను వేయికన్నులతోఁ జూచుచు నేయు న్నారు. మాకు నిజముగా వేయికన్నులుండియును మిమ్మునను గనుఁగొన శక్తులము గాము. నాయదృష్టవశముచే మీదర్శనములభించి కృతార్థుఁడ నైనాను. (సాష్టాంగము జేయుచున్నాఁడు)

కృష్ణు- (ఇంద్రునిఁ జేతులతోనాదరముగా లేవనెత్తి) ఘటోత్కచునితో నాయనా హైడింబ ! మనమాలస్యము చేయరాదు. సత్వరముగా సుభద్రాభిమన్యులను శశి రేఖను మఱియు నీతల్లి మొదలగు బంధువర్గమును రావించి శీఘ్రముగాఁ బ్రయా ణము సాగింపుము.

ఘటో- చిత్తము ! సేవక ! మనవారినందఱను బ్రయాణముచేసి రావింపుము.

సేవ- మహాప్రసాదము ! (నిష్క్రమించెను)

సుభద్ర- (ప్రవేశించి( అన్న ! వాసుదేవ ! మీకుమీచెల్లెలునమస్కరించుచున్నది)

కృష్ణు- అమ్మా ! మనోరథ సిద్ధియగుఁగాక. మనయన్న గారిదిగో నిన్నుఁదోడ్కొని పోవవచ్చినారు !

సుభ- (విస్మయమును నటించి( ఔర !

సుగంధి॥ కూఁడుగుడ్డలైనలేక కుంపుచిట్లుకావలం

గోడువాంయువారిఁజూడఁ గోరిసీరియేలఁదా
వీడువాఁ సియిట్లువచ్చె వింతదోఁచెనామదిఁ
జూడువాఁడివీడనెంత చుల్కనాడు రెల్లఱుఁ॥

బల- అమ్మా! సుభద్ర! ‹‹బుద్ధిః కర్మానుసారిణీ,›› యనునట్లు నా కింతటియవస్థ కనిపెట్టియుండ నేనెట్లు నిన్నాదరించెదను? ఇఁక జరగినదానిని మఱచి పొమ్ము శశిరేఖ యెట్లయినను నీకోడలు. (చేయిపట్టుకొనుచున్నాఁడు)

కృష్ణ- చెల్లెలా! నీకువచ్చిన గోడేమి మాకువచ్చినవాఁడేమి? చూడు.

గీ॥ లోకమంతయు నేకమై డీకొనంగ
వీఁకఁబీచమడంచెడు నీకుమారు
లేకమయి మూడులోకము లేలఁగఁ రు
వారలుండఁగ నీకేటి వగపులమ్మ॥

క॥ లోకములోనెవ్వరైనను
వీఁకనుదుర్యోధనాది వీరులఁగడిమిం
డీకొని జయించఁగలరే
నీకొడుకులుదక్కవంత నీకువమేలా॥

సుభ- నీవు పాండవపక్షపాతివి గనుక నట్లు పొగడెదవుకాని- ఇదియంతయు నిజమా?

బల- అబ్బబ్బ! ఏమిచెప్పెదవిఁక క్షమింపుము దల్లీ.

సుభ- అన్నయ్యా! సీరాయుధ! నీవు నాకోరికఁ జెల్లించెదవేని.

గీ॥ ఎఱిఁగియెఱుఁగక హైడింబుఁడిట్లుచేసె
దీనిమదిలోననుంచక వానిఁబ్రోచి
నీకొమార్తెనుగొంచుపో నాకుమఱియు
నెచ్చెలైనను గోడలుపచ్చుఁగాక॥

కృష్ణ- అమ్మాయి! పశ్చాత్తప్తచిత్తుల కెట్టిదోషములును రావెఱచును. నీయన్న జరిగిన దానికే విచారించుచుండ మఱింతె చెప్పకుము. అదిగాక.

గీ॥ చెల్లెల్లా! నీదుకోర్కెలుబల్లిదుండు
నగ్రసుతుఁడగు హైడింబు నతిబలమ్మున
డీకొఁగానేఁదు వెతకెడు తీవయట్లె

పాపములనంటకొనుభంగి సాదరమున ॥

(అప్పుడు, శశిరేఖాభిమన్యులును హిడింబయుఁ బ్రవేశించు చున్నారు)

శశిరేఖాభిమన్యులు- (అందఱకు నమస్కరించు చున్నారు)

అందఱును- త్వరగాదంపతులుకండు.

బల- (శశిరేఖశిరము మూర్కొని సబాష్పగద్గదికముగా) అమ్మా !

గీ॥ నిదురలోనిన్నురక్కసుఁ డదిమిపట్టి
వనములకుఁ గొంచుపోవనీమనమునందు
నెంతచింతించితివో నన్ను నెంచియెంచి
యక్కటా ! క్రూరకర్ముఁడ నైతినిగదె ॥

(కన్నీరు రాల్చుచున్నాఁడు)

శశి- (తనలో) అవును నిన్నెంచి యెంచి విచారించుచు నేయున్నానుతండ్రీ !

అందఱు- కాలవశమట్లున్నది. సీరాయుధ ! నీకుఁ దెలియనిదేమున్నది. నీవట్లు చింతింపఁ గూడదు-

కృష్ణు- మేఘవాహన ! నారదాగులతో వచ్చి మనుమనికిఁ బెండ్లిచేయింపఁగోరెదను.

దేవేం- లోకేశ ! లీలామానుష వేషివై భూలోకమున నవతరించిన యాదివిష్ణుఁడ వగు నీవు నన్నాజ్ఞాపించవలసియుండగాఁ గోరెదననవేల ? (ప్రక్కకుఁజూచి) సేవక మాతలిని రథమాయిత్తము చేయుమనుము.

సేవ- చిత్తము (నిష్క్రమించెను)

మాతలి- (రథసహితుఁడై ప్రవేశించుచున్నాఁడు)

ఘటో- పూజ్యులార ! రథము సిద్ధముగానున్నది మీరందఱునధిష్ఠించుటయే.

అందఱు-(రథమెక్కిరి)

సారథి- (రథమతివేగముతోఁ దోలుచున్నాఁడు)

ఘటో- వాసుదేవ ! ఈయారంభమంతయు మీయాజ్ఞను బొందకయే చేసితిని నాకుదిగులుగలుగుచున్నది.

కృష్ణు- వత్స !

చ॥ దిగులదర్శేలనోయసుర ధీరమతంబునన న్నెయెంచుచు
త్యగణితవాయువేగమునసంబరవీధిని నాటరేయినీ

దగువనిదాటి మామకగృహంబుపయిన్విన యౌవ్వనాంజలొగ్గిమా
యగశశిరేఖడొంగిలిన యావదుదంతము నేనెఱుంగనే? ॥

క॥ ఓభీమపుత్ర ! వినుమీ
నీభీమపరాక్రమంబు నీశౌర్యంబీ
పాశిభవమునధిక ధైర్యము
నీభువినన్యులకుఁగలదె యేటికిమాటల్ ॥

ఘటో- దేవా ! వసుధాధర కందరాబంధురంబగు సింహప్రతిశబ్దంబు మదవేదండంబులను దమడంచు చందమునఁ దమయనుగ్రహమే మామకసర్వానిష్టములను శమింపఁజే యనిష్టకామ్యములఁ బొందుచుంటిమి.

సారథి- (రథమాపి) అయ్యా ! ఇదిగో బలరామసౌధమునకు వచ్చితిమి.

బల- కృష్ణా ! ఈసుముహూర్తముననే పరిణయము గావించవలెను. శీఘ్రముగాఁ బెద్దలను బిలువనంపుము.

కృష్ణ- చిత్తము.

అందఱు-(రథావతరణముచేసి లోపలఁ బ్రవేశించినారు-)

రంగము.

——:*బలరామసౌధములోని పెండ్లిమంటపము.*:——

(శశిరేఖాభిమన్యులు పరిణయమైయొకరిశిరముపైనొకరు ముత్యంబులదోసిళ్లుజల్లికొనుచున్నారు. తక్కినసభ్యులు యథాస్థానములఁగూరుచున్నారు.)

అభి- (శశిరేఖంగ్రీకంటితోఁజూచి తనలో) ఔరా ! ఏమి యీచిన్నదాని చెన్ను ! ఈ మెకు యౌవనము వచ్చినతరువాత నిప్పటికిగదా యీమెను జూచుభాగ్యమబ్బినది.

ఈమెకు:- గీ॥ పెట్టఁబడనియలంకార మట్టిమేనఁ
బుట్టెయౌవన మాసవమునుగొనకయె
మదముపుదయమొనరజనియించె మగువవొల్చె
నంగజను మేతశేషుసమంచితముగ॥

క॥ జన్వనికమరెనుమేలువ
హావ్వా ! వళిపంక్తికాముఁడధిరోహింపన్
యౌవనపుశిల్పిగట్టిన

మవ్వపుఁబంగారుమెట్ల మాడ్కినినాభిన్ ॥

క॥ మృగములకుఁ లజ్జగలిగినఁ
దగనీచెలివేణిఁజూచి తప్పకచమరీ
మృగములుతమవాలంబులఁ
బగతోనీడ్చించిప్రియము వాయవెతలఁపన్ ॥

క॥ సుందరమరాళగతిసాగ
సుందరిఁజేరంగనీవు సుందరినడకల్
మందరగిరిధిక్కృతుకుచఁ
గుందరదనవెన్నబ్రహ్మ కుందరమగునే ॥

(తలపంకించి) విస్తారమేల ? సర్వోపమానవస్తుసమాహారమొక్కచోయథాస్థానముఁ బొందినదిమచ్చుజూపఁగోరి విధాతయీమెస్సృజింపఁబోలు !

ఉ॥ ఖ్యాతిగముత్తెపుంజడులఁ గాంతునిదేహముముంపఁబూనితాఁ
గౌతుకమొప్పమత్యములఁ గాంతమనోహరరక్తవర్ణమా
చేతధరింపనెట్టినయిచిమ్మగఁడెల్లనివైకనంబమున్
నాతివిచిత్రమెంతయును నాకపజాలమువోలెఁదోచెడున్ ॥

గీ॥ అతివపతికంఠజాణయౌనను చుజనులు
ముదితులై మెచ్చమితిలేనిముత్తెములను
మీదజల్లంగఁగొప్పిక్కారుమెఱుపులేచి
మౌక్తికాసారమెడలించుమాడ్కిఁదోఁచె॥

కానిమ్ము! మాటిమాటికిననుమీఱఁదలఁచు నీచెలియుత్యమముఁజూడ నొకకొంత వడినేనవిరమించెదను.

రామభట్లు- (సభవైపుచూచి) అయ్యావివాహమైనది ఇఁకపూజ్యులందఱు వధూవరులనాశీర్వదింపవలెను.

అందఱు- ఆయురారోగ్యసంతతైశ్వర్యసంపత్సుప్రవర్తనాసిద్ధిరస్తు. అనియక్షతలఁజల్లుచున్నారు.

సుభద్ర- (పరుగుపరుగునవచ్చి)

క॥ ఇంపగుపుత్రులుగలిగియు

సొంపగు కోడండ్రతోడ సూర్యావధిగాఁ
బెంపున రాజ్యము సేయుచు
దంపతులు సుఖింత్రుగా తతసంపదతోన్॥

(అక్షతలు జల్లుచున్నది)

అందఱు- తథాస్తు.

దేవేం- వత్స! సౌభద్రి? ఇంకయు నీకేమి కావలెను?

అభి- తాత! త్రిదివస్పతి! లోకారాధ్యుఁడగు మామామ శ్రీకృష్ణమూర్తి యొక్కయు మీ యొక్కయు ననుగ్రహముచేఁ జిరకాంక్షితయగు శశిరేఖం జేపట్టితి. మఱియు నాకోరికయిది.

క॥ స్వామియగు కృష్ణుని కృపం
గామితములు వడయవలయుఁ గవిసజ్జనులెం
తో మహితసుగుణవైఖరి
నీమహిఁ రాజిలుఁగాఁత మీతిరహితగన్॥

దేవేం- నాయనా! సరే. ఇట్లగుగాక (భరతవాక్యము)

సీ॥ పరఘనాసహనులు, పరధనాపహరులు, పరదారగమనులు వంచకులును
కల్లకథలు జెప్పి కాసువీసములను స్తుతిజేసిలాగెడుసోమరులును
తెల్లని కాకియు నల్లనికొంగయుఁ గలవననమ్ము మూర్ఖవ్రజంబు
న్యాయంబు పక్కయనాథజనంబుపై దండెత్తువీరయోధవ్రజంబు
మందుకైనను లేకుండమణఁగి మఱియు
దయయు సత్యంబు శౌచంబు ధర్మరతియు
నీతియు నహింస, యింద్రియనిగ్రహంబు
పరజనోపకృతియుఁ గల్గి పరగునట్టి
యుత్తమోత్తములిల వెలయుదురుగాక॥

(అందఱు నిష్క్రమించిరి)

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, వాధూలసగోత్ర, కస్తూరివంశ,
పవిత్ర సుబ్బరాయామాత్యపుత్ర, సద్విధేయ, శివశం
కరనామధేయప్రణీతంబైన బలజాసౌభద్రీ
యము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ